# కాలమే మందు?




# ప్రశ్నావళి

— కె. రామలక్ష్మి

ఎస్.ఎస్.ఎస్. – కుటాగుళ్ల

ప్రేమించిన స్త్రీ దూరమైనప్పుడు మనిషిగా పడే బాధ ఎలాంటిది?

బాగుంది! 'పెంపు'గా పడే బాధ తెలిసిందా! తన పన్లు తాను చేసుకోవలసివస్తే కూడా బాధపడిపోతాడు మగవాడు! దానికి ప్రేమక్ ముడి వేయకండి.!

ఎస్ ఎల్ ఆర్ గుంటకల్

మీరే కనుక ఎం. ఎల్. ఏ. అయివుంటే, దేశానికి కాకపోయినా, మీ వూరికైనా కొంచెం సేవ చేసేవారు.

అప్పుడు ఏ వూరికి? అనే ప్రశ్న వచ్చి— ఒద్దు బాబూ. . . సేవ చేయాలనుకుంటే ఎం. ఎల్. ఏ. కానక్కరలేదు!

పి ఎస్ - హైదరాబాద్

స్త్రీ రచయితలు ధైర్యంగా రాయలేరంటాను. మీరేమంటారు?

మీరు వస్తున్న, వచ్చిన సీరియల్స్ శ్రద్ధగా చదవడం లేదంటాను. బి. ఆర్. ఇషారా కూడా చిత్రీకరించలేనంత ధైర్యమైన రేప్ సీను ఈ మధ్య ఓ నవలలో రాసింది చిట్టూరెడ్డి సూర్యకుమారి!

బి.ఎన్.ఆర్ ఆర్ - విజయవాడ

ఏ పని చేస్తున్నా ఆనందం మిగలడం లేదు. ఎలా?

ఆనందం మీద కూడా నమ్మకం వుండాలి. లేకుంటే ఆనందమే రాదు. అంతే కాదు. ఈ మానవ మానసి పరుగులు తీసేది— ఆనందం నుంచి ఆనందానికి — కాదు రావుగారూ— ఆశనుంచి ఆశకి.

ఆర్. టి. మిర్యాలగూడెం

గృహిణి అంటే అధికారమున్న పని మనిషి అవునా?

అధికారం కూడా వుంటే పనిమనిషి అయినా ఫరవాలేదు! వట్టి బాధ్యతలే కలది గృహిణి!

ఆడవారంటే అసహ్యంగా చూసే వారినేమనాలి?

వారి తల్లిని గురించి, సోదరీమణుల గురించి భార్యని గురించి— ఓ సారి గుర్తు చెయ్యాలి.

డి వి. కదిరి

ఎదుటివారి మనస్సు నొప్పించ కూడదంటారు. మరి నిజం మాట్లాడితే నిష్ఠూరమే కదా!

నిజాన్ని కూడా నేర్పుగా చెప్పాలి—ఏ చేదు మాత్రకైనా చక్కెరపూత అవసరం. కదా ?!

పి. వి. ఆర్. కొల్లావూరు

సగము బట్టలు వేసుకొని తిరిగే వారికి ఇప్పుడు పూర్తి స్వేచ్ఛ వచ్చింది. . . స్ట్రీకింగ్ మనకీ పాకిందంటే— మనం అభివృద్ధి చెందామన్న మాట. రాను రాను మనదేశం చాలా హీన స్థితికి దిగజారి పోతోందనుకోలేరు.

బెంగ పెట్టుకోకు రమణా! మనకిదేమైనా కొత్తా? 'అన్నీ మన వేదాలలో వున్నాయషోయ్' అన్నట్లు— ఈ దిగంబరత్వం మనకి— ప్రాచీనపు పోకడే— నవీనంగా తలెత్తుతూంది!

పి. పి. ఎల్. ఎన్ బొంబాయి

మీరు ఇన్నాళ్లూ పురుష ద్వేషి అనుకున్నాను. ఇప్పుడు మీరు ప్రభుత్వాన్ని కూడా ద్వేషిస్తున్నారు. మీకు ఇంక శంకరగిరి మాన్యాలే గతి అంటాను.

చిత్తం. మరేం ఫరవాలేదు—ఇప్పుడు మనం ఏలుతున్నవి అవే!

డి. కె. పి ఆర్. అనంతపురం

మీరు సర్వలక్షణ సమన్వితులుగా ఎలాటి వారిని భావిస్తారు?

అలాంటి వాళ్లు ఉండరు.

(18వ పేజీ చూడండి)

# ఉత్తరాలు

### కార్టూన్లు

రంగ్రావ్ గారి 'మళ్ళీ వచ్చిన వానాకాలం' కార్టూనులు మమ్మల్ని కడుపుబ్బ నవ్వించాయి.

పఠితలు: కొరటమది సరోజ, జి. కౌసల్య, జి. వేణమ్మ, శారదామహిళామండలి, (అరుజ.)

### నేను దొంగనా?

ఈ వారం ముఖచిత్రంలో వెలువడిన సంచిక మాకెంతో ఆనందాన్నిచ్చింది. ఇక్కడ 30, 40 తెలుగు కుటుంబాలవాళ్ళం ఉన్నాం. వచ్చిన మొదటి రోజే పత్రిక దొరకడం కష్టం. ఉత్తరాలు! 'నేను దొంగనా?' లాంటి కథలు వేసుకుని మా ప్రాణాలు తీయకండేం? పోతే ఇందులో 'గుండె నాడు', 'అర్థాతే వెరుతే' కథలు బాగున్నాయి. వాణిశ్రీగారి 'అమ్మమ్మ కాశీ యాత్ర' మమ్మల్ని కడుపుబ్బ నవ్వించింది.

రామచంద్రమూర్తి బంధా, (...)

(47వ పేజీ చూడండి)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక


వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 – 1972)
శుక్రవారం : 1-8-'75
రాక్షసనామ సం. ఆషాఢమాస బ. నవమి
*సంపుటము : 68 సంచిక : 46*
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
★
సంవత్సర చందా – రు. 33-80
ఆరుమాసాల చందా – రు. 16-90
విడిప్రతి వెల 60 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520003.


## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ :
నటి శకుంతల

*కథలు :*



*సీరియల్ కథలు :*



*వ్యాసాలు, శీర్షికలు :*



లోకం పోకడ - డేమెన్ *











*(గత సంచిక తరువాయి)*

### 5

"మా బిందె చిల్లుపడింది. మీ బిందో మాటియ్యి కామాక్షి పిన్నీ, నీళ్ళు తెచ్చుకొని తొట్టిలో ఒంపుకొని మళ్ళా ఇస్తాను" అంటూ వీధి చివర కామాక్షమ్మ ఇంట్లోంచి బిందె తీసుకొని, చెరువు నుంచి నీళ్ళు పట్టుకొని ఇంట్లోకి వస్తుండగా, లోపల నుంచి ఇవతలకి వస్తూన్న అంకరాజు ఎదురయ్యాడు ఉషకి. వెళుతూ వెళుతూ తనకేసి అదోలా చూశాడు. ఆ చూపు వేటగాడి చూపులా నిశితంగా ఉంది. పగ పట్టిన తాచుపాము కళ్ళలా అతని కళ్ళు అతి భయంకరంగా ఉన్నాయి. అంకరాజు అలా చూడ్డంతో ఉషకి వెయ్యి విషపు సూదులు ఒక్కమాటు వంటినిండా గుచ్చినట్లయింది.

ఆ బాధనీ అసహ్యాన్నీ దులపరించుకొని విసురుగా లోపలికి వెళ్ళింది అప్పుడే భద్రయ్య మాత్ర మింగి, ఇంకా పూర్తిగా గొంతు దిగలేదేమో అనే అనుమానంతో మరో అర గ్లాసుడు నీళ్ళు తాగుతున్నాడు. "ఈ సమయంలో నాన్న మందు వేసుకున్నాడేమిటి చెప్మా...ఇది మందు టైము కాదే ?... అరగంట క్రితమే గదా తను మందు ఇచ్చి వెళ్ళింది?" అలా అనుకుంటూ నీళ్ళబిందె వంటింట్లో దింపి వీధి వసారాలోకి వచ్చింది ఉష.

భద్రయ్య ఆయాసంతో బాధపడుతూ మధ్య మధ్య దగ్గుతూ, మంచం నడుం ఎక్కి కూచున్నాడు. ఈ ఆయాసం ఇలాగే ఒక్కొక్క రోజున ఎక్కువై పోతుంది ఊపిరి అందక నాన్న మెలికలు తిరిగిపోతూంటే, ఆ బాధ చూడలేక తన మనస్సు ఏక కొట్టుకు పోతుంది. నిస్సహాయంగా కన్నీళ్ళు కార్చడం తప్ప తనేం చెయ్యగలదు ? అక్కడికీ ప్రభాకరం ఆ మందు కాదని ఈమందూ, ఇదికాదని అదీ మారుస్తూ తన సాయశక్తులా ప్రయత్నిస్తూనే ఉన్నాడు, నాన్న పడుతూన్న ఈ అవస్థని కొంత కాకపోతే కొంతైనా ఉపశాంతి చెయ్యడంకోసం... ఇవాళ్టికి వాళ ఏదో కొత్త మందు వచ్చిందంటూ చీటీరాసి, తీసుకు రమ్మని చెప్పి,పట్నం వెళుతూన్న అన్నయ్యకిచ్చి పంపించాడు. ఆ మందు దొరికి, అదైనా పట్టిస్తే కొంత విశ్రాంతి నాన్నకి... ఊపిరి అందక ఎలా గిలగిలా కొట్టుకుంటున్నాడో!

ఉష భద్రయ్య పక్కని కూర్చుని గుండెలు రాస్తూ "స్థిమిత పడు నాన్నా,తగ్గిపోతుంది... అన్నయ్య పట్నం వెళ్ళాడుగా ? కొత్త మందు పట్టుకొస్తాడు" అంది. భద్రయ్య జాలిగా కూతురుకేసి చూశాడు. "వెర్రితల్లి! తన సేవలోనూ ఈ ఇంటి చాకిరీలోనూ ఎలా నలిగిపోతోందో! హాయిగా ఈపాటికి పెళ్ళి చేసుకొని సరదాగా కాపురం చేస్తూ ఉండవలసిన పిల్ల! తన బ్రతుకే బ్రతుకుని తను ఎప్పటికైనా దీనికి పెళ్ళిచెయ్యగలడా?... ఈ దౌర్భాగ్యుడి కడుపున ఎందుకు పుట్టావు తల్లీ!"- అనుకొని, కళ్లల్లో నీళ్ళు గిర్రున తిరుగుతూఉంటే, ఆయాసంవల్ల ఏం మాట్లాడలేక, కూతురు తలని నీరసంగా నిమిరాడు భద్రయ్య... అతని బాధ ఏమిటో అర్థంకాక "తగ్గిపోతుంది నాన్నా... ఒక్క నిముషం నిద్దరపడితే ఇంకో గంటలో అన్నయ్య వచ్చేస్తాడు... ఆ కొత్త మందు వేసుకుంటే ఆయాసం పూర్తిగా తగ్గుతుందట. నిద్రపట్టించుకో నాన్నా కొంత బాధ తెలియదు" అంది ఉష డగ్గుత్తికతో.

"నిద్ర ... అవును ... వేసుకున్నా ... మాత్రలు ఇచ్చాడుగా ... అంకరాజు ..." అంటూ అతి ప్రయత్నం మీద అని, చేతిలో ఇంకా మిగిలిపోయిన మాత్ర చూపించి, ఆయాసపడుతూ ఉండిపోయాడు భద్రయ్య.

ఉష కంగారుగా "అంకరాజు మాత్రలు ఇవ్వడం ఏమిటి ? ... వాడేమైనా డాక్టరా ? వాడిచ్చిన మాత్రలు నువ్వెందుకు వేసుకున్నావు" అంది ...

"నిద్దర మాత్రలమ్మా..."

"ఏమైనాసరే...ఆ చేతిలో మాత్ర ఇలా ఇచ్చెయి. వేసుకొన్నవేవో వేసుకున్నావు ... చాల్లే..." అంటూ తండ్రి చేతిలో మాత్ర లాక్కుని పక్కనున్న స్టూలుమీద పెట్టి తండ్రికి గుండెలు రాస్తూ కూర్చుంది. చాలాసేపటివరకూ భద్రయ్య ఆయాసపడుతూనే ఉన్నాడు. భవిష్యత్తు గురించి భయంగా ఆలోచిస్తూ పరధ్యానంగా ఉండడంవల్ల, భద్రయ్యకి ఎప్పుడు కునుకు పట్టిందో గమనించలేదు ఉష.

నెమ్మదిగాలేచి గుండెలవరకూ దుప్పటీ కప్పి, హరికేన్ లైటు వెలిగించి హాల్లో పెట్టి, పొయ్యి అంటించి బియ్యం కడగడం కోసం ఉష పెరట్లోకి వెళ్ళింది.

వీధి తలుపు ఎవరో తోసిన చప్పుడైంది.

లోపల గడియ వెయ్యలేదా తను ?

ఎవరో లోపలికి వచ్చి గడియవేస్తూన్నట్లు అలికిడయింది.

పట్నంనుంచి అన్నయ్య వచ్చాడు కాబోలు! మందు తెచ్చాడేమో!... పొయ్యిమీద అత్తెసరు పడేసి మురళిని పలకరిద్దాం అని ముందు వసారాలోకి వచ్చింది ఉష.

సెంటు వాసన గుప్పుమంది.

భద్రయ్య నిశ్చింతగా నిద్రపోతున్నాడు.

హరికేన్ లైటు క్రీనీడలో జంకుతూ నిలబడ్డ అంకరాజు! ఉషకి ఒక్కమాటు భయంతో వళ్ళు జలదరించింది. ఎదురుగా చూసింది. అంకరాజు వెకిలిగా నవ్వుమొహం పెట్టాడు. తను బయటికి వెళ్ళడానికి వీలు లేకుండానూ, బయటివారెవరూ లోపలికి రావడానికి అవకాశం లేకుండానూ, తలుపుకూడా గడియపెట్టాడు.

రాత్రివేళ, అన్నయ్య ఊళ్లో లేని సమయంలో, నాన్న నిద్రపోతూన్న అదను కనిపెట్టి, ఒంటరిగా తను ఉన్నప్పుడు, ఈ అంకరాజు ఇలా వచ్చాడంటే ?... ఉష వెర్రి ఆవేశంతో అరిచింది "ఏమిటా వెకిలినవ్వు ? మర్యాదగా బయటికి వెళతావా వెళ్లవా ?"

అంకరాజు ప్రాధేయపూర్వకంగా "అరవకు

*జరిగిన కథ 3 :* భద్రయ్య గారి పిల్లలు మురళి, ఉషలు. భద్రయ్య గారి ఆస్తంతా దాన ధర్మాలతో హరించి పోయింది. చదువంటకపోయినా చిత్ర లేఖనం నేర్చుకుంటాడు మురళి. అంకరాజు మిల్లులో గోడౌన్ కీపరుగా చేరతాడు మురళి. భద్రయ్యగారి కుటుంబాన్ని కనిపెట్టి వుండమని కొడుకు డాక్టరు ప్రభాకరానికి చెప్తారు జోగమ్మగారు.

ఉషా నీకు పుణ్యం ఉంటుంది... అసలు నేను చెప్పేది కొంచెం విను" అంటూ రెండడుగులు ముందుకు వేశాడు. 'ఏం వినక్కర్లేదు నువ్వు బయటికి నడుస్తావా నడవ్వా."

"నే చెప్పేది వినమంటూంటే"

"నా...న్నా!"

"ఆయన్ని లేపకు. హాయిగా నిద్ర పోతున్నాడు. పైగా ఆయనిప్పుడప్పుడే లేవడు ...మీ అన్నయ్య కూడా ఇంకో గంట గంటన్నరకి కాని పట్నం నుంచి రాడు..."

"ఇదా నీ పన్నాగం? ఇందుకన్న మాట ఆయనచేత నిద్దర మాత్రలు మింగించింది?"

"నువ్వు ఎలాగేనా అనుకో ... కాని నేను చెప్పేది పూర్తిగా విను"

"ఏవిటి నువ్వు చెప్పేది?... పో ముందు బైటకి"

"ఉషా!"

"ఏం? ... అరిచి అల్లరి చెయ్యమంటావా?"

"నువ్వు 'ఊ' అను...నిన్ను నేను పెళ్లి చేసుకుంటాను"

"ముందు వెళ్తావా వెళ్లవా ?"

"అయితే నీ పట్టే నీది అన్నమాట ! నేను నిన్ను పెళ్లి..."

"నోర్మూయ్యి"

"లాభంలేదు...ఇంకా నీతో మర్యాదగా మాట్లాడదాం అని"

"పోముందు...మర్యాదట··· మర్యాద.."

"పోడానికి రాలేదు ఉషా!"

"ఆఁ!"

అంకరాజు తడబడుతూ రెండడుగులు ముందు కేశాడు ఉష భయంతో వణికిపోయింది పిచ్చికేక ఒకటి పెట్టి అంకరాజు చెంప చెళ్లుమనిపించింది. ఉద్రేకంలో వళ్ళంతా కాలిపోతూన్న అంకరాజు చటుక్కున ఆమె చెయ్యి పట్టుకున్నాడు. బలమైన అతని చేతిలో ఉష గాజులన్నీ ముక్కముక్కలుగా విరిగిపోయాయి చర్మం చిట్లి రక్తం వస్తూన్నా లెక్క చెయ్యకుండా ఉషనటూ రెండు చేతులూ చుట్టి దగ్గరగా లాక్కున్నాడు. క్షణ క్షణానికీ బిగుస్తూన్న అతని కౌగిలిలో నిస్సహాయమైన పక్షిలా గిల గిల కొట్టుకుంటోంది ఉష శరీరంఅంతా అతని స్వాధీనంలోకి వెళుతోంది. ఎంత పెనుగులాడినా లాభం లేకపోతోంది. ఆమె గుండెల్ని తన ఛాతీకి గట్టిగా అదుముకుంటూ వీపుమీదునా జాకెట్టుని తొలగించడానికి ప్రయత్నం చేస్తున్నాడు... పైట ఎప్పుడో జారిపోయింది... చీరకుచ్చిళ్లు... జాకెట్టు చిరిగిపోయింది... తనచుట్టూ వాడి ఇనుప చేతులు... తన గుండెల్ని క్రూరంగా అదుముతూన్న వాడి బలమైన ఒళ్ళు ..

అసహ్యం... ఆవేశం... దుఃఖం...

తన బతుకు కాలిపోబోతోందనే పిడుగు లాంటి భయం...

పిచ్చికుక్కలా రెచ్చిపోతూన్న అంకరాజు... ముద్దు పెట్టుకోవడంకోసం మొహం మీదకి వంగాడు...

గట్టిగా పళ్ళతో కండ ఊడివచ్చేటట్లు అంకరాజు దవడ కొరికింది ఉష...

"అమ్మో" అంటూ ఒక్క అరుపు అరిచి, ఉషని వదిలేశాడు అంకరాజు

జుట్టు రేగిపోయి, బొట్టు చెరిగిపోయి, జాకెట్టు చిరిగిపోయి, చీర కుచ్చిళ్లు ఊడిపోతూంటే, కూలిపోతూన్న మల్లె పందిరిలా వీధి తలుపు దగ్గరికి పరిగెత్తింది ఉష ... రెచ్చిపోయిన ఆంబోతులా, దెబ్బతిన్న అడివి దున్నలా రొప్పుతూ వెనకాలే వచ్చి ఆమెని మళ్లీ



## గాజు మేడ

పట్టుకోబోయాడు అంకరాజు. కాని అప్పటికే ఉష చెయ్యి తలుపు గడియ తీసేసింది. ఓ చేత్తో ఉషని పొదివి పట్టుకుని, మరో చేత్తో తిరిగి గడియ పెట్టబోతున్నాడు అంకరాజు.

కాని అప్పటికే ప్రభాకరం గడప దాటి ఓ అడుగు లోపలికి పెట్టాడు. ఆ సమయంలో అక్కడ ప్రత్యక్షం అయిన ప్రభాకరాన్నిచూసి, ఒక్క క్షణం ప్రాణంలేని కట్టెలా నిస్తేజుడై ఉండిపోయి, వెంటనే పిచ్చి భయంతో 'బే'! అని ఒక వెర్రి అరుపు అరిచి అక్కడ నుంచి వంటింట్లోకి పరిగెట్టి, అక్కడనుంచి పెరటి గుమ్మంద్వారా బయటికి పారిపోయి, చీకట్లో కలిసిపోయాడు అంకరాజు.

ప్రభాకరం పదిగజాల దూరం అతణ్ణి తరిమాడు కాని, ''ఎక్కడికి పోతాడులే ... పొద్దుట చూద్దాం వాడి సంగతి'' అనుకొని వెనక్కి వచ్చాడు.

గోడవైపు తిరిగి చేతుల్లో ముఖం కప్పుకొని వెక్కి వెక్కి ఏడుస్తోంది ఉష. ప్రభాకరానికి సంగతి అర్థంఅయి తల పంకించాడు. ''ఏడవకు ఉషా...సమయానికి నేను వచ్చాను కదా !'' అన్నాడు.

''ఇంకో క్షణం అయితే నా బతుకు ఏమై పోయేది'' అంటూ భోరుమంది.

''ఏమయేది ?వాడు నా చేతిలో చచ్చివుండేవాడు...సర్లే...రేపు ప్రొద్దున్న వాడి సంగతి తేలుస్తాను...నువ్వు ముందు లోపలికి వెళ్లి ఆ చీరా జాకెట్టూ మార్చుకురా... అదేమిటి ఆ నోటినిండా రక్తం? ''

ఉష చేత్తో పెదిమలు తుడుచుకుంది... నిజమే ! తన పళ్లనిండా రక్తమే!... తనకేమీ గాయం లేదే ! ఒక వేళ అంకరాజు ముఖాన్ని కరిచినప్పుడు... ఉష మళ్లీ ఆవేశంతోనూ భయంతోనూ ఊగి పోవడాన్నిచూసి ''అవునూ...నాన్నకి ఎలాఉంది ఆయాసం?'' అంటూ మాట మార్చి ఆమె దృష్టి అటు త్రిప్పాడు ప్రభాకరం...

అటు చూస్తూనే కెవ్వుమంది ఉష...

కంగారుగా చెవుల దగ్గర స్టెతోస్కోపు పెట్టుకుంటూ భద్రయ్య మీదకి వంగాడు ప్రభాకరం !

భద్రయ్య మంచానికి సరిపడగా,ఉబ్బిపోయి లావుగా రెట్టింపు మనిషయి కనిపించాడు.

స్టెతోస్కోపు మడిచి చేత్తో పట్టుకుని, వంగి ఉన్న వాడల్లా లేచి, నిటారుగా నుంచుంటూ విషాదంగా కనిపించిన ప్రభాకరాన్ని ఆదుర్దాగా చూస్తూ, గుండెల్లో కోటి కోట్ల భయాలు దిగులుగా వ్యాపిస్తూంటే, "ఏవిటి డాక్టరుగారూ! నాన్నఎలాఉన్నాడు?" అంటూ అడిగింది ఉష. ప్రభాకరం ఆమెకేసి జాలిగా చూశాడు.

"మాట్లాడరేం? ... చెప్పండి! ... నాన్న..." ఉష దాదాపు ఏడుస్తూ ప్రాధేయ పూర్వకంగా అడిగింది.

ప్రభాకరం నిట్టూర్చి "ఎలా చెప్పను?... ఈ ఆయాసందగ్గా ఇంకాయన్ని ఏం చెయ్యలేవు. ఈ ఇంటి సిరిసంపదలూ సుఖ సంతోషాలూలాగే ఆయన కూడా వెళ్లి పోయారు!" అన్నాడు గద్గద స్వరంతో.

ఆ మాట వింటూనే ఉష 'ఆఁ!' అంటూ హృదయవిదారకంగా అరిచి, వెంటనే స్పృహ తప్పి పడిపోయింది. కింద పడకుండా ఉషని పట్టుకున్నాడు ప్రభాకరం. నెమ్మదిగా గోడ వారని పడుకోబెట్టి లోపలికి వెళ్లి నీళ్లు తీసుకువచ్చి ముఖంమీద చిలకరించాడు. పది పదిహేను నిముషాలకి కాని ఉషకి తెలివి రాలేదు. కళ్లు తెరుస్తూనే లేచి "నాన్నా" అంటూ భద్రయ్య మంచం దగ్గరికి పరిగెట్టింది. తండ్రి శవంమీద పడి గోలున ఏడుస్తూ, "అమ్మ పోయినప్పుడు మమ్మల్ని నువ్వు ఊరుకోబెట్టావు. ఇప్పుడు ఎవరు ఊరుకోబెడతారు నాన్నా" అంటూ ఘొల్లు మంది.

ప్రభాకరం ఉషని ఊరుకోబెట్టాలని ఎంతో ప్రయత్నించాడు... భద్రయ్య గుండెల మీద తలపెట్టుకుని ఏడుస్తూ "ఇంక మాకు దిక్కెవరు నాన్నా..." అంటూ బావురమంది. ఆమె బాధ చూస్తూంటే ప్రభాకరానికి కళ్లనీళ్లు ఆగలేదు. తన శాయశక్తులా బుజ్జగిస్తూ "ఊరుకో ఉషా... ఎంతసేపు ఏడిస్తే ఏం లాభం చెప్పు... నా మాట విను... గుండె పగిలిపోయేలా ఏడుస్తున్నావు... కొంచెంసేపు సేద తీర్చుకో... ఈ మంచినీళ్లు తాగు" అన్నాడు... "నేను ఏడవడంకంటే ఏం చెయ్యగలనండి డాక్టరుగారూ!... నాకిప్పుడు అమ్మా నాన్నా ఇద్దరూ లేరు" అంటూ మళ్లీ ఏడ్చేసింది ఉష.

"నా మాట విను ఉషా... ముందు నువ్వక్కడ నుంచి లే" అంటూ జబ్బ పట్టుకుని బలవంతంగా ఆమెని శవం దగ్గర నుంచి దూరంగా తీశాడు.

"మా నాన్న మీద పడి నన్ను ఏడవనీండి ...నాకు ఇంక మిగిలింది అదేకదా..." అంటూ మళ్లా భద్రయ్య మంచంవేపు వెళ్లబోయింది. "ఉహుఁ!..." అంటూ ప్రభాకరం మళ్లీ ఆమెని గట్టిగా పట్టుకుని ఆపుచేశాడు.

"అయ్యో ... నాకా యోగం కూడా లేకుండా చెయ్యకండి ... మీ కాళ్లట్టుకుంటాను...నన్ను వదిలెయ్యండి...నాన్నా ..." అంటూ శోక దేవతలా ఉష ఏడుస్తూన్న సమయంలో మురళి లోపలికి వచ్చాడు. ఏదో భయంకరమైన విషయమే జరిగి ఉంటుంది అనుకుంటూ బెరుకు బెరుగ్గా లోపలికి అడుగు పెట్టిన మురళికి, ఏడుస్తూన్న చెల్లెలూ, ఊరుకోబెడుతూన్న ప్రభాకరం, మంచంమీద చలనం లేకుండా పడుకున్న తండ్రీ కనిపించే సరికి గుండెల్లో ఏదో బండ రాయి పడ్డట్లయి, స్థాణువులా ఆ మట్టునే నిలబడిపోయాడు.

అన్నగారిని చూస్తూనే కట్టలు తెగిన పొంగులా గొల్లుమని ఏడుస్తూ వచ్చి "అన్నయ్యా! ... నాన్న వెళ్లిపోయాడు" అంది ఉష — మురళి చేతిలో సంచీ జారి పోయింది.

తనని కౌగలించుకోడానికి వచ్చిన చెల్లెలితో సహా మొదలు నరికిన చెట్టులా కూలబడి పోయాడు మురళి. అన్నా చెల్లెలూ అలా పసివాళ్లలా ఏడుస్తూంటే, ఎలా ఊరుకోబెట్టాలో తెలియక కన్నీళ్లు కారుస్తూ ప్రభాకరం మౌనంగా నుంచుని ఉన్నాడు. 'భద్రయ్యగారింట్లోంచి ఏవో ఏడుపులు వినిపిస్తున్నాయి' అంటూ చుట్టు పక్కలవాళ్లూ, ఆ వీధిలోవాళ్లూ అంతా అక్కడికి చేరుకున్నారు.

"అయ్యో భద్రయ్యగారు పోయారు."

"ధర్మరాజులాంటి మనిషి."

"ఎటువంటి బతుకు బతికాడు మారాజు."

"పాపం ఇంకా పిల్లలకి ఎవరు దిక్కు?"

ఇలా వచ్చిన వాళ్లంతా గుడ్ల నీరు కుక్కుకుంటూ "ఏడవకండమ్మా... ఆయనకేం?... మహరాజులా పోయాడు" అంటూ ఉషనీ మురళినీ ఊరుకోబెట్టసాగారు.

సీతాలుకి ఆ కబురు తెలిసి పరుగు పరుగున వచ్చి, అక్కడి పరిస్థితి చూసి వెంటనే వెళ్లి జోగమ్మకి ఆ సంగతి చెప్పాడు... వెంటనే జోగమ్మ అదిరిపడి... "ఆ...ఆ... భద్రయ్యగారు పోయారా?" అంటూ కుర్చీలో ఆ మట్టునే కూలబడిపోయింది. తర్వాత కాస్సేపటికి తేరుకొని "సీతాలూ... నేనక్కడికి వెళుతున్నాను కాని... తలుపులన్నీ వేసి నువ్వక్కడికి రా... కుర్రమొహాలు... గుండె పగిలేలా ఏం ఏడుస్తున్నారో ఏమో .. వాళ్లని దగ్గిరికి తీసేవాళ్లైనా లేరు" అంటూ జోగమ్మ రావుడిని తీసుకుని ఆ చీకట్లో బయలుదేరింది...

"నాన్న వెళ్లిపోయాడు అత్తయ్యా" అంటూ కాళ్ళకి చుట్టేసింది ఉష... "ఏడవకమ్మా...ఏంచేస్తాం?" అంటూ ఉషని పొదివి

(43వ పేజీ చూడండి)

## ఇది అంతర్జాతీయ మహిళా సంవత్సరం



సోమేశ్వర్ మా సందులోనే అద్దె కుంటున్నాడు. నాలానే సోమేశ్వర్ కూడా బ్రహ్మచారి. అతనికీ ఇంగ్లీష్ సినిమాలపిచ్చి వుంది నాలాగే. మా పరిచయం అందువల్ల దృఢపడింది.

ప్రతీ ఆదివారం ఫస్ట్ షోకి నేను, సోమేశ్వర్ కలిసి ఏదో ఓ ఇంగ్లీష్ సినిమాకి వెళ్ళడం తప్పదు. సోమేశ్వర్‌కి స్నేహితు లెక్కువ. అందుకు కారణం, సోమేశ్వర్ కథకుడు. నవలలు, గేయాల లాంటివి వ్రాయడు.




కేవలం చిన్న కథలే వ్రాస్తాడు గాబట్టి కథకుడంటున్నాను. సాధారణంగా అతని స్నేహితులు కథల గురించే మాట్లాడు కుంటూంటారు కాబట్టి, సోమేశ్వర్ కథలంటే నాకు ఎంతో, ఇంతో ఆసక్తి ఏర్పడింది.

సోమేశ్వర్ కథలు అప్పుడప్పుడు చదువు తుంటాను, అతని గదికి వెళ్ళినప్పుడు. తన కథలు అచ్చయిన పుస్తకాలనేకం సోమేశ్వర్ గదిలో టేబిల్ మీద చిందర వందరగా పడుం టాయి ఎప్పుడూ.

కథలు తప్పక చదవాలనే ఆసక్తి నాకు ఎప్పుడూ లేదు. రచయితలతో స్నేహం చేసుకోవాలనే ఇంటస్ట్ కూడా లేదు. నాకు కథలకి అనేక చక్కటి ఆలోచనలు వస్తూం టాయి కాని, వాటిని కాగితం మీద ఎలా దింపాలో పద్ధతి తెలియదు.

ఆలోచిస్తే. అయిదారు రోజులు కష్ట పడితే తెలుస్తుంది. కాని నాకంత ఓపికలేదు. నాలా అలా ఓపికలేని అనేకమంది కూడా తమ ఆలోచనలని కాగితం మీదకి ఎక్కించ లేరు కాని, వ్రాయగలిగితే, మంచి రచనలే చేయగలరని సోమేశ్వర్‌తో అంటే, సోమేశ్వర్ నవ్వుతాడు.

సోమేశ్వర్ గదిలో ఓ బైండ్ చేసిన పుస్తకం వుంది. ఆ పుస్తకంలో సోమేశ్వర్ చేతి వ్రాతతో, అతను వ్రాసిన శతాధిక కథలు వున్నాయి ముందర ఆ పుస్తకంలో వ్రాసుకుని, తర్వాత కథని కాగితాల మీద నీట్‌గా తిరగరాసి పంపుతూంటాడు సోమేశ్వర్.

ఓసారి మేన్యుస్క్రిప్ట్ బైండ్‌ని తిరగే స్తూంటే ఓ ఇంగ్లీషు టైటిల్ నాకళ్ల బడింది. చిన్న కథ అది. దానిపేరు 'ఒన్స్ ఏ థీఫ్' కథ పేరు బావుంది అనుకోవడంవల్ల నేనా కథని కొద్దిగా వుత్సాహంగా చదివాను, సోమేశ్వర్ బాత్ రూంలో బట్టలు పిండు కుంటుంటే. చిన్నకథె అయినా. మంచి కథ అది. క్లుప్తంగా ఆ కథావస్తువు ఇది.

ఓ ఆదర్శవాది ఇంట్లో అర్ధరాత్రి దొంగ ఒకడు ప్రవేశిస్తాడు. డబ్బు దస్కం మూట కట్టుకుని పారిపోబోతుంటే పట్టు బడతాడు. ఆ ఆదర్శవాది ఆ దొంగని పోలీసులకి అప్పగించడు. చావ చితక తన్నడు. ఆ దొంగని ఆ పరిస్థితులకి దిగజార్చిన సంగతులడిగి తెలుసు కుంటాడు. ఆ దొంగ అంటే సానుభూతి ఏర్పడుతుంది. ఆ దొంగకి ఓ వంద రూపా యలు ఇస్తాడు. ఆ దొంగచేత తన ఇంటిదగ్గరే

**—పై వా ర మే—**

**నటి జయసుధకి ఇష్టమైన ఎనిమిది మంది ఎవరు ?**

కూరలవ్యాపారం ప్రారంభం చేయిస్తాడు.

క్రమంగా ఆ దొంగ, తన దొంగ బుద్ధిని మానుకుని, కూరల వ్యాపారంలో స్థిరపడి, సంఘంలో మంచి మనిషిగా బ్రతుకుతాడు. మంచివాడుగా మారిపోతాడు.

నాకా కథ బాగా నచ్చింది. దొంగతనాలు చేసేదొంగలని మంచి మార్గంలోకి మళ్లించే విధానాన్ని తెలియచేసే ఆ కథ నాకు అమితంగా నచ్చింది. సంఘంలో దొంగతనం ఓ ప్రాథమిక సమస్య. దానికి పరిష్కారంగా మలచబడిందీ కథ. అలాంటి అవినీతిపరుడుని మంచి మార్గంలో పెట్టాలి అనే సందేశం వుందా కథలో ఆ కథ వెనక అందమయిన, ఆరోగ్యకరమయిన ఆలోచన వుంది.

కథ బావుందన్నాను సోమేశ్వర్‌తో పిండిన రడిబట్టలని, గదిలో తీగల మీద ఆరేస్తూ చెప్పాడు సోమేశ్వర్ నాతో.

"నిజమే. ఆ కథ బావుందని చాలా మంది వుత్తరాలు వ్రాసారు ఒక సందేశం ఇచ్చే కథ అది నీకు తెలుసుగా. అమ్మాయిలకి నచ్చే అందమయిన ప్రేమ కథలు వ్రాయలేను నేను. ఇలాంటి, సంఘానికి పనికివచ్చే కథలు వ్రాయటమంటేనే నాకిష్టం నా ప్రతీ కథా, దాదాపుగా ఇలాగే ఏదో ఓ సందేశాన్ని ఇస్తుంది పాఠకులకి. అందుకే నా కథలంటే చాలామందికి ఇష్టం."

"ఈ కథ ఎలా వ్రాసావు ? ఇంత మంచి అయిడియా ఎలా తట్టింది ?" అడిగాను తెలుసుకోవాలని.

కథల గురించి ఇంత డైరెక్టుగా సోమేశ్వర్‌ని నేను అంతకు ముసు పెన్నడూ అడగటం జరగలేదు కాబట్టే కామోసు వివరంగాచెప్పాడు.

"ఇది వరకల్లా కథ చదివి, బావుంది బావుళ్ళేదు" అని మాత్రమే అనేవాడివి నువ్వు. ఇప్పుడు అడుగుతున్నావుకాబట్టి చెప్తున్నాను. ఆ కథ వ్రాయబోయే ముందు, రెండుమూడు నెలల కితం, పల్లెంచ వెళ్ళాను, ఏదో పనిమీద. నేనుంటున్న ఇంట్లో అర్ధరాత్రి దొంగలు పడ్డారు రెండుమూడు రోజుల తర్వాత ఇద్దరిని పట్టుకున్నారు.

దొంగిలించిన సామాను ఎక్కడ దాచిందీ చెప్పించడానికి కొట్టారు. చెప్పినతర్వాతకూడా, దొంగతనం చేసారనే కోపంతో వాళ్లిద్దరినీ బాగా కొట్టారు స్తంభానికి కట్టేసి. ఆ సంఘటన నా మనసులో హత్తుకుపోయింది. ఓ సారి దొంగయినవాడు ఎప్పటికీ దొంగగానే బ్రతకాల్సిన అవసరం లేదనిపించింది. ఫలితంగా ఈ కథ వ్రాసాను."

చిన్నగా నవ్వాను.

"ఒక్క అయిదు నిముషాలాగి. 'ఏ మేన్ కాల్డ్ హార్స్' అనే మంచిసినిమా ఆడుతోంది. వెళదాం" అన్నాడు.

నేను మిగతా కథలు తిరగేయసాగాను.

* * *

దాదాపు పది రోజుల తర్వాత, సెకండ్ షిఫ్ట్ అయాక నేను ప్లాంట్ నుంచి తిరిగి వస్తుంటే, సర్కస్ బుకింగ్ ఆఫీస్ ముందు చాలామంది జనం చేరి ఎవరినో కొట్టడం చూసి అటు వెళ్ళాను ఏమిటో చూద్దామని.

దాదాపు పాతికేళ్ల వ్యక్తిని బాదుతున్నారు జనం. అతనికి ముక్కులోంచి, నోట్లోంచి రక్తం కారుతోంది. పర్స్ పిక్‌పాకెట్ చేసాడుట అంతకుముందే. పాపం. దొరికిపోయాడు.

నేను వాళ్లని వారిస్తూ చూసాను పర్స్ పోయి దొరికిన ఆ వ్యక్తి వంక. కోపంగా చెయ్యి ఎత్తుతున్నాడతను, మరోసారి ఆ దొంగమీదకి నన్నుచూసి. గుర్తించి ఎందుకో చటుక్కున చెయ్యి దింపేసాడు.

సోమేశ్వర్ అతను.

సో ... సో మే శ్వ ర్ కేవలం కలం మనిషే ! ?

## నీ నేను

గడ్డిపోచపై, రాత్రి
పడ్డ మంచుబొట్టు ను నేను :
నీ తొలిపిలుపు తరుణ కిరణాన
మహేంద్ర ధనస్సునై మిడిసిపడ్డాను!

తీగతల్లి తూగుటుయ్యేల
పట్టి పువ్వును నేను :
నీ మందహాసాన లసించి
ముంగిట మందారమ్మునై
హసించినాను !!

— సమాఖ్య

# సామాన్యుని సణుగుడు

ఏమిటో ప్రేమ అంటారు పవిత్రమంటారు. దీనికోసం ప్రాణాలిస్తామంటారు. మామూలు కథల్లోనూ సినిమా కథల్లోనూ అలాగే రాస్తున్నారు. సినిమా డైలాగులు అలాగే వుంటాయి ... కాని డ్యూయట్‌ల దగ్గర కొచ్చేసరికి "అందించు నీ తీపి పెదవి!" అంటూ అబ్బాయి అరుస్తాడు పబ్లిక్ పార్కులో "అనుభవించు నా వయసు పొంగులన్నీ నీవే...తనివితీరా" అంటూ అమ్మాయి ఆర్కెస్ట్రా సాయంగా అరుస్తుంది. ఆ తర్వాత 'రయ్' న వాళ్లిద్దరూ వచ్చి ఒండొరులను హత్తుకుపోతారు ... ఆ'విడరాని' బంధాన్ని— హాల్లో ప్రేక్షకుల్లోగల సామాన్య గృహిణులు బొత్తిగా మాగజీన్‌లు అవీ చదవటానికి అలవాటు పడని వారూ, — కేవలం కళ్ళు మూసుకుని తప్ప మరో రకంగా విడదీయలేరు. అలా వీళ్లు కళ్లు మూసుకున్నారని తెలిసి కాబోలు ఈ బంధం ఎవరూ విడదీయలేని 'పవిత్ర'? బంధం అని డైలాగు కూడా ఉంటుంది.

ఇదేం ప్రేమో ... ప్రాచీన కావ్యాలలో మాదిరీ కాదు — ఆధునిక నవలలో మాదిరీ కాదు "ఏకమైపోదామా" అంటూ ఆడా—మగా ఏకమైపోతూ వుంటే అంత పెద్ద తెరమీద ... దాందుంప తెగిరి ఎంత మంచివాడైనాసరే అమాంతం విలన్ లాగ వెళ్లి వాళ్లని ఆపేయాలను కుంటాడు కాని నరాలు తెగకుండా వూరుకోగలడా?

ఆహా! ఆహా ! మన తెలుగు సినీ పాటల లోని సాహిత్యం వింటే చాలు మళ్లీ రహస్యంగా సెక్స్ గ్రంధాలేవీ పిల్లలు చదవక్కరలేదు అబ్బబ్బ ! యింత ఘాటు ప్రేమా, మొగుడు పెళ్లాల మధ్య పడగ్గదిలోనైనా కాదూ ... పార్కులో పవిత్రంగా ప్రేమించుకుంటున్న ప్రేయసి ప్రియులయిన స్టూడెంట్‌ల మధ్య ... కాని దీనిమీద స్టూడెంట్‌లు ప్రొటెస్టు చేయకపోయారా ? మధ్య మీకెందుకయ్యా పిల్లలు వాళ్లూ అంటారా? నిజమేకాని మరి పిల్లల వాళ్లం కనుకనే కదా...మాకు బాధ ... అదీ సంగతి.

[-పి]

# దేవుడ్నే దోచిన దొరలు

తమిళనాడుకు చెందిన మధురలో ద్వారకానాధుని గుడిలో ఆ గుడి మేనేజరు, మరికొందరు కలసి స్వామివారి నగానట్రాలను కాజేశారట. స్వామివారు చెప్పకపోయినా, ఈ విషయం బయటపడి, మేనేజరు ఐ. పి. సింగును, రామకృష్ణ అనే ఒకతన్ని పోలీసులు పట్టుకున్నారట. దేవాలయంలోనే వో మూల దాచిన నగానట్రా దొరికాయట కానీ మూడు వేల విలువచేసే వెండి పాత్రలూ వగైరాలు కనపడలేదట. కైంకర్యమవలేదుకదా కొంపముంచి!

## తరతరాలకూ తీరని బాకీ!

మీ తాత నా దగ్గర తొంబై మూడు రూపాయలు అప్పుచ్చుకున్నాడు. అది యిప్పటికి పెరిగి మోపెడయ్యింది. అది నువ్వు కక్కు అని బాండాలో వో జమిందారుగారు తన ఇంటిలో పని చేస్తున్న వో హరిజన యువకుడిని, అతని కుటుంబాన్ని కూడా ఇంట్లో కట్టి పడేశాడట. ఈ కుర్రాడి తండ్రి, తాత కూడా ఆ జమీందారు వద్ద పని చేశారట. అంతేగాక ఆ బాకీ వల్లే యీ కుర్రాడు కూడా పని చేస్తున్నాడట. బర్దాన్ అనే ఆ హరిజనుడు జమీందారుకు నాలుగు వందల రూపాయలు ఆ బాకీ, దానికి వడ్డీగా జమ చేశాడట. తాను దాస్యం (జీతభత్యాల్లేకుండా) చేస్తున్నాడట. ఇంతయినా ఇంకా వెయ్యి రూపాయలు బాకి అని జమీందారు అని, అతన్ని, అతని కుటుంబాన్ని నిర్బంధించాడట. బర్దాన్ ఎలానో తప్పించుకుని, తన వారిని కూడా రక్షించమని చట్టాన్ని కోరాడట.



### అగ్గిపెట్టెవల్ల హంతకుని ఆచూకీ

13 వ తేదీన బొంబాయి చెంబూరు ప్రాంతానికి చెందిన 55 ఏళ్ల ఛాబ్రియా అనే ఆమెను ఎవరో కొందరు చంపేసి యాభై వేలకిమ్మత్తు చేసే నగా, నట్రా ఎత్తుకుపోయారట శవం పక్కన వున్న వో అగ్గిపెట్టెను ఆధారం చేసుకుని పోలీసులు యీ కేసును పరిష్కరించి హతురాలి భర్తకు బంధువైన ప్రకాష్ లక్ష్మన్ దాస్ ఆహూజా అనే అతన్ని, అతని అనుయాయులనో పది మందినీ పట్టేశారట. హంతకుడు వదలిన అగ్గిపెట్టె ఉల్లాస్ నగర్‌లో తయారు చేసేదట. దానికి ఎక్కువగా అమ్మకం లేనందువల్లనా పోలీసు ఆ వూరెళ్ళి విచారించితే అంతా కదిలిందట.

### రేషనుకోసం వస్తే...

మధురలో 27వ తేదీన మధ్యాహ్నంపూట మూసి ఉన్న వో రేషను షాపు ముందు "తెర తీయగరాదా" మననం చేసుకుంటూ రేషనుకొచ్చినవారు కూర్చున్నారట. ఆ షాపు ముందు పెట్టి ఉన్న మూడు కిరసనాయిలు డ్రమ్ములు ఉన్నట్లుండి పగిలి, మంటంటుకుని, ఆ మంట ముప్పయ్యడుగుల ఎత్తుకు లేచిందిట. పారిపోయినంతమంది పారిపోగా పారిపోలేని వారినో నలుగుర్ని ఆ మంట ఆహుతి చేసుకుని, ఏడుగురి చావు వరకూ లాక్కెళ్లిందట. మధ్యాహ్నం స్కూలయి, ఇంటికి వెళ్తున్న వో అమ్మాయి మీదకూడా ఈ మంట పడి, ఆ పిల్ల ఒళ్లంతా కాలిపోయిందిట. ఇంతకూ ఆ పీపాలు పేలడానికి గల కారణాలు తెలీలేదట.

### జనాన్ని ఆకర్షించే నగ్న స్నానాలు

సముద్రంలో వేసవిలో నగ్నంగా స్నానం చేసి, బీచి ఇసుకలో సాగోరడం ప్రారంభమయ్యాక, ఆ దృశ్యాల్ని చూడ్డానికొచ్చే ఉత్సాహవంతులకు పట్టపగ్గాల్లేకుండా పోతోందని బీచి బీచంతా యీనినట్లు జనమేనని, "కేప్ కాడ్ నేషనల్ సీ షోరు"ను గురించి అమెరికా ప్రభుత్వంలో ఆ శాఖ తరపు అధికారి మిస్టర్ హడ్లే విచారించారట. నగ్న స్నానం చట్టవిరుద్ధమైనది కాకపోయినా, యీ దృశ్యాలను చూడ్డానికి వచ్చే ఉత్సాహవంతులలో బీచి అందమంతా పాడవడమే గాక, చక్కని గడ్డి (లాన్) అందమైన మొక్కలు కూడా నాశనమయిపోతున్నాయనాయన వాపోయారట— హ్యాండ్రెడ్ హవ్, ఐ విష్ టు బి ఇన్ కేప్‌కాడ్!

### విద్యార్థి ఆత్మహత్య

బందరు ఫ్రెంచి పేటకు చెందిన 18 ఏళ్ళ చావలి వెంకటేశ్వరప్రసాద్ అనే బీ. కాం విద్యార్థి దరిద్ర బాధని ఎదుర్కోలేక, అది పెట్టే పరీక్షలకు తట్టుకోలేక, ప్లాస్టిక్ వైరుతో ఉరి పోసుకుని చనిపోయాడుట.

### మార్కుల గారడీ!

గుంటూరు జిల్లా తాడికొండ స్కూలులో మొన్న ఎస్. ఎస్. సి. పరీక్షలకు వెళ్లిన తొంభై ఆరు మంది మొదటి తరగతిలోనే ఉత్తీర్ణు లయ్యారట. అంతేగాక టోటల్ ఫస్టులు వచ్చిన వారు కూడా యీ స్కూలువారేనట. ధర్మారావనే కుర్రాడికి అరువందలకూ 532 మార్కులు వచ్చాయట. సుధాకరబాబుకు 520, సుబ్రహ్మణ్యేశ్వరశర్మకు 516 వచ్చాయట. ఆనందదాయకమైన విషయమే గాక, అబ్బురమైన విషయం కూడా కదా! కాదు మరి!

### తిరిగిరాని విజిలెన్సు డైరెక్టరు

17 వ తేదీ ఉదయం అల్లా తిరిగొద్దామని బయలుదేరిన రాయ్‌పాల్ అనే యాభై యేళ్లాయన వెళ్లి తిరిగి రానేలేదట ఢిల్లీలో. ఈయన కామర్స్ మినిస్ట్రీలో విజిలెన్స్ విభాగంలో డైరెక్టరుట. అదా కారణం!!

### చంద్రునిపై జీవనం

1999 నించి 2000 సంవత్సరం వచ్చే నాటికి విజ్ఞాన, వైద్య విద్యా శాస్త్రాలు చాలా పెరిగిపోతాయని, ఆనాడు విద్యార్థులు, విద్యార్థినులు తమ కాలేజి చదువులు చంద్రగ్రహం మీదే చదువుతారని, ఆ చంద్రమండలం మీద ఆడామగా కూడా ఉంటారు గనుక ఈ శతాబ్దం అయ్యేలోగా చంద్రమండలంలో పిల్లలు కూడా పుట్టొచ్చని "స్పేస్ అండ్ రాకెట్" లాస్ ఏంజలిస్ విభాగానికి చెందిన ప్రముఖుడు వార్నర్ వాన్ బ్రౌన్ అన్నారట. ఈ శతాబ్దం అయ్యేక కొన్నాళ్లు పోయాక మనం చంద్రమండల వాసులతో వియ్యం పొందచ్చున్నమాట. లేపోతే ఒరే అబ్బాయ్! శలవుల కింటికొచ్చేయ్ అని చంద్రునికేసి చూసో గావు కేక పెట్టనూవచ్చు! వై నాట్!

### డొనేషన్ల బెడద తప్పినట్టే...

ప్రయివేటు స్కూళ్లల్లో గాని, కాలేజీలలో గాని "సీట్లు కావాలంటే డొనేషనులు ఇవ్వాలోచ్" అనే విషయాన్ని ఆంధ్రప్రదేశ్ విద్యామంత్రి క్రిష్ణారావుగారు ఖండించారట. ఏ స్కూలు గానీ, కాలేజీ గానీ డొనేషనులు తీసుకుని సీటు ఇవ్వలేదని (అనగా డొనేషనులు తీసుకోరాదనే తాత్పర్యం) అలా సీటివ్వడానికి డొనేషనులు తీసుకుంటే, అట్టి విద్యాసంస్థల మీద ప్రభుత్వం తగిన చర్య తీసుకుంటుందనీ గట్టిగా చెబుతూ ఏ సీటుకి ఎవరైనా ఏ సంస్థకైనా (విద్యా సంస్థే) అలాటి డొనేషన్లు ఇచ్చి ఉంటే, అట్టివారు తనకు తెలియజేస్తే తగిన చర్య తీసుకుంటానని కూడా హామీ ఇచ్చారుట — ఏమి!!

### ఉబ్బసం తెచ్చే గడ్డిపూలు

బెంగుళూరు రస్సెల్ మార్కెట్‌లో అమ్మే ఓ రకం పూలగుత్తులు చూడ్డానికి అందంగా ఉన్నా, అవి తీసుకెళ్లి ఇంట్లో పెట్టుకోవడం ఒంటికి ప్రమాదమని, యీ పూల వల్ల ఆస్త్మా వంటి రోగాలు వస్తాయనీ బెంగుళూరు కార్పొరేషను కమీషనరుగారన్నారట. ఈ మొక్కలను "కాంగ్రెసు గ్రాస్" అంటారట. ఈ మొక్కలను పెంచేవారు తామే వాటిని పీకేసి పారెయ్యాలని, లేనిచో కార్పొరేషను పనివారు వచ్చి పీకిపారేసి, అందుకయిన ఖర్చులను వసూలు చేయాల్సి ఉంటుందని కూడా ఆయనన్నారట. ఈ పార్తీనియమ్ హిస్ (కాంగ్రెస్ గ్రాస్) ఆకుపచ్చని ఆకులతో తెల్లటి పువ్వులతో ఉంటుందట. ఈ పూలు, చెట్లు ఉబ్బసాన్ని పుట్టిస్తాయిట.

### ప్రాణాలు తీసిన రథోత్సవం

మద్రాసు ట్రిప్లికేను పార్థసారథిస్వామి దేవాలయానికి సంబంధించిన సందర్భములో 25వ తారీఖున రథోత్సవంలో ఆ రథం క్రింద పడి ఒకాయన చనిపోవడము, మరొకాయన కాలు పోవడమూ జరిగిందట. రథం సింగరాజాచారి వీధిలోకి మలుపు తిరుగుతుండగా ఈ ప్రమాదం సంభవించిందట.

### ఉపాధ్యాయుల సత్తా చూసే విద్యార్థులు

ఉపాధ్యాయులు, ఆచార్యులు తాము క్లాసుల్లో చెప్పాల్సిన పాఠ్య భాగాన్ని అసలొక్కసారైనా చూసుకు రాటం లేదని, ఏ విద్యార్థి అయినా ప్రశ్న వేస్తే నిలువు గ్రుడ్లు వేస్తున్నారనీ అధ్యాపకుల మీద విద్యార్థులు ఆరోపించారట. యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషను నియమించిన ఓ కమిటీ విశ్వవిద్యాలయంలో విద్యార్థుల తమ ఆచార్యులను ప్రశ్నలు వేసి, వారి సత్తా ను పరీక్షించవచ్చని తేల్చిందట. భేష్!!



## ఇంటింటి చిట్కాలు

★ వెన్న తీసేందుకు తేలికమార్గం: ఈరోజు రెండునిముషాలు కవ్వంతో చిలికి మూతపెట్టి వుంచండి. మరునాడు ఇంకొక్కనిముషం చిలికితే చాలు వెన్న హాజరు.

★ పాలు చెడిపోతాయనుకుంటే మళ్లీ కాచేముందు చిటికెడు వంటసోడా వేసి కాయండి.

★ కూరల రంగు పోకుండా వుడకపెట్టాలనుకుంటే చెంచాడు పంచదార కలిపి వుడకపెడితే సరి.

★ వుల్లిపాయను నిలువుగా తరిగితే కళ్లల్లో పడటం నీళ్ళురావటం అనేవి ఉండవు.

★ బియ్యం, పప్పులు పురుగుపట్టకుండా ఉండాలంటే ఎండిపోయిన వేపాకుతోపాటు వుంచండి.

★ బొబ్బట్లు చేసి ఆ జిడ్డు వదుల్చుకోటానికి సోపులు అవి వాడేబదులు పూర్ణాన్ని కొద్దిగా చేతికి రాసుకుంటే ఆ జిడ్డు వదుల్తుంది.

★ నేల తెల్లగా రావాలంటే సబ్బునీళ్లలో కొద్దిగా కిరసనాయిలు కలపండి.

★ కిరసనాయిలు స్టవ్ (వత్తులది మాత్రమే) మీ గిన్నెలకు మసి చేస్తుందా? ఈసారి కిరసనాయిలుతో పాటు ఒక చెంచా వుప్పుకూడా వెయ్యండి.

— జి. విజయప్రసాద్

"ఈయనే సీవైఎన్ కేటాయి, ఈ అన్నగారి అబ్బాయి ప్రభాకరం, ఇండస్ట్రీస్ డిపార్ట్‌మెంటులో పనిచేస్తున్నాడు" అని నా వైపు తిరిగి "వీరు సాంబశివరావుగారు. రిటైర్డ్ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్" అంటూ మమ్మల్ని ఒకరినొకరికి పరిచయం చేశాడు బాబాయి.

"నమస్కారమండీ" అన్నాను నేను.

ఆయన ప్రతి నమస్కారంచేస్తూ, "రండి బాబూ, లోపలకు" అంటూ హాలులోనికి దారితీశారు. మేము ఆయన వెనకే లోనికి వెళ్లి అక్కడ సోఫాలో కూర్చున్నాం.

"ఇప్పుడే వస్తా"నని మాతో చెప్పి ఆయన లోపలకు వెళ్లి మళ్లీ రెండు నిముషాలలో తిరిగి వచ్చారు. బాబాయీ, ఆయనా ఏవో కుశల ప్రశ్నల్లో పడ్డారు.

కాస్సేపట్లో చక్కగా అలంకరించుకున్న యువతిని వెంట బెట్టుకొని ఒక ముసలావిడ అక్కడకు వచ్చింది.

"కూర్చోమ్మా"అని "మా అమ్మాయి సరోజ. ఇది మా ఆవిడ" అంటూ వాళ్లిద్దరినీ పరిచయం చేశారు సాంబశివరావుగారు.

ఆ అమ్మాయి సిగ్గుపడుతూ ఆయన ప్రక్కనే ఉన్న సోఫాలో కూర్చుంది. కొద్ది క్షణాలు ఆమె వంక చూస్తూండిపోయాను. ఆమెలో ఏదో గొప్ప ఆకర్షణ ఉందనిపించింది నాకు. నేను మొదటిసారిగా చూసిన అమ్మాయి ఇంత అందగత్తె కావడం నా అదృష్టం అనిపించింది. "ఏమైనా అడగదల్చుకుంటే అడుగు బాబూ" అన్నారు ఆయన. సంకోచిస్తూనే "ఎంతవరకు చదువుకొన్నారు" అని ప్రశ్నించాను. నా గొంతు నాకే ఏదో వింతగా వినిపించింది. గొంతులో ఎందుకో కొంచెం వణుకు.

ఆమె మెల్లగా తలఎత్తి "ఇంటర్ పాస్ అయి మానివేశా" నంది. "ఈ సంవత్సరం పెళ్లి చేయాలని మేమే చదువు మాన్పించాం నాయనా! కావాలనుకొంటే పెళ్లయిన తరువాతయినా చదువుకోవచ్చుగదా!"అన్నారు వాళ్లమ్మగారు.

నేను తలూపేను.

ఇంకా ఆమె నడగవలసిన ప్రశ్నలేవీ నాకు తట్టలేదు. ఇంతలో లోపలనుండి ఒకావిడ టిఫిన్లు, కాఫీలు తీసుకొచ్చారు. షుమారు ముప్ఫయ్యేళ్లుండవచ్చు ఆమెను చూపించి "మా పెద్దకోడలు" అని చెప్పారు ముసలాయన. పెద్దబ్బాయి ఆఫీసుకూ, చిన్నతను కాలేజీకి వెళ్లినట్లూ కూడ ఆయనే చెప్పారు. కాఫీలు తీసుకోవడం అయ్యాక, "అమ్మాయిని లోపలకు తీసికెళ్లండమ్మా" అన్నాడు బాబాయి. ఆడవాళ్లంతా లోపలకు వెళ్లిపోయారు మరి పదినిముషాలు అవీ, ఇవీ మాట్లాడక "మరి మేము శలవు తీసుకొంటామండీ" అంటూ లేచాడు బాబాయి.

"మీ అభిప్రాయం తెలియజేసే మిగతా విషయాలు మాట్లాడుకోవచ్చు" అన్నారు సాంబశివరావుగారు.



# ఎక్కడుంది లోపం?

సి.వి. సూర్యనారాయణమూర్తి

"అలాగేనండీ. మీకు ఉత్తరం రాస్తాం. తరువాత మా అన్నగారితో మీరు వచ్చి మాట్లాడవచ్చు'' అన్నాడు బాబాయి.

అలా అనడం ఆమె అర్హతను తక్కువ చేయడం అనిపించింది నాకు "ఎందుకు బాబాయ్! ఇపుడే చెప్పేయవచ్చు. సరోజ నాకు నచ్చింది. తప్పక చేసుకొంటాను" అన్నను నేను.

"అయితే కట్నం విషయం అవీ మాట్లాడటానికి''...అని ఆయన అంటూండగానే

"అటువంటివేమీ మీరు పెట్టుకోకండి. కట్నం తీసుకొని పెళ్లి చేసుకోవడం నాకిష్టం లేదు'' అన్నాను. బాబాయి తెల్లబోయి నావంక చూస్తున్నాడు. నేను అప్రయత్నంగా లోపల గదిలోకి చూశాను. సరోజ కన్పిస్తుందేమోనని. బహుశా తలుపు వెనక ఉండి వుంటుంది. కనిపించలేదు.

"చాల సంతోషం బాబూ. మంచి రోజు చూసుకొని వచ్చి మీ నాన్నగార్ని కలుసుకొంటాను''అన్నారు ఆయన.

నేను శలవు తీసుకొని బయట పడ్డాం.



వెంటనే అందుకొన్నాడు చిన్నాన్న.

"ఏరా! నీకు బుద్ధుందా? ఆ అమ్మాయికు నచ్చిందే అనుకో.

అంత వెంటనే ఆ మాట నువ్వే చెప్పెయ్యాలా? పైగా కట్నం అక్కరలేదని అంత ప్రగల్భంగా చెప్పావు. దాని ఫలితమేమిటో ఆలోచించావా? నీ మీద అన్నయ్యా, వదినా ఎన్ని ఆశలు పెట్టుకొన్నారో తెలుసా?'' విరుచుకు పడ్డాడు నా మీద.

ఈ విషయాలన్నీ నాకు బాగానే తెలును. ఎటొచ్చీ తెలియనిదల్లా, వీళ్లందరినీ కాదని నా ఆశయం ఎలా నెరవేర్చుకోవాలనేదే

నాలుగేళ్ళ నా కాలేజీ జీవితంలోనూ, ఆ తరువాత రెండేళ్ల ఉద్యోగ జీవితంలోనూ నాలో అనేక ఆశయాలు ఏర్పడ్డాయి.

నేటి రచయితుల ఘాటైన రచనలుచదివి కట్నాలు ఈ నాటి దురాచారాలలో ఒకటనీ, వాటిని నిర్మూలించటానికి నా లాంటి యువకులు ఎవరికి చేతనయిన కృషి వారు చేయాలనీ నమ్మాను. అందుకు చేయవలసిన త్యాగాలకు సిద్ధంగానే ఉన్నాను. ఎటొచ్చీ ఈ విషయంలో పెద్దలను అంగీకరింప చేయడమే కష్టమని నాకు తెలుసు. అందుకే అన్నాను చిన్నాన్నతో "బాబాయ్! ఈ విషయంలో నువ్వే నాకు సాయంచెయ్యాలి యింట్లో ఎలా చెప్పాలో తెలియక డైరెక్టుగా వాళ్ల ముందే ఆ మాట చెప్పాను. నాన్నను ఒప్పించగల వాడవు నువ్వే''అని ఆ విషయంపట్ల నా అభిప్రాయాలూ, నిర్ణయాలూ, నాకు చేతనయినంత వివరంగా చెప్పాను.

ఏమనుకున్నాడో ఏమో బాబాయి. "ఒరేయ్! నువ్వేదో సాంఘిక సంస్కర్తవు కావాలని ఇలా చేస్తున్నట్లున్నావు. దీనివల్ల సంఘానికి ఏమి జరిగినా జరక్కపోయినా ముందు నష్టపోయేది మీ కుటుంబం. నీ చదువు కోసం మీ వాళ్లు అనేక అవసరాలను కూడా వదులుకొని నీకు ఖర్చు పెట్టారనీ, మీకు వెనకేమి చెప్పుకోదగ్గ ఆస్తి లేదనీ నీకు తెలియని విషయంకాదు నీకు పెళ్లి కావలసిన చెల్లెలూ, చదువుకోవలసిన తమ్ముళ్లూ వున్నారు. వాళ్ల పట్లనీ బాధ్యత నేను గుర్తు చేయనవసరం లేదనుకొంటాను..."

"ఆ బాధ్యతలు నేను తీసుకోకపోతేగదా! తమ్ముళ్ల చదువూ, చెల్లెలి పెళ్లీ విషయాలలో నాన్నగారి బాధ్యతలన్నీ నావిమాత్రం కావా బాబాయ్! చెల్లెల్ని కూడ కట్నం

# ఎక్కడ ఉంది లోపం ?

తీసుకోనివాడికే ఇచ్చి చేయాలని నా ఉద్దేశ్యం'' అన్నాను నేను.

''సరేరా! నీ యిష్టం. కాని నీలాగ నీ చెల్లికికూడ ఎవరో దొరుకుతారని ఆశించడం ఆమె భవిష్యత్తుపట్ల ''రిస్క్'' తీసుకోవటమే అవుతుంది. అవసరమైతే ఏదో విధంగా తెచ్చియిస్తాంగానీ, నీ ఆదర్శాలకోసం దాని భవిష్యత్తును పణంగా పెట్టములే, నువ్వు అడిగినట్లు నీ అర్థంలేని పట్టుదల సంగతి మీ యింట్లో చెపుతాను. తరువాత నీ ఖర్మ'' అన్నాడు. ఆయనకెంత చికాకు కల్గిందో తెలుస్తూనే ఉంది.

నేను ఎదురుచూడని విధంగా మా నాన్నగారు ఆ విషయాన్ని అసలు సీరియస్‌గా తీసుకొన్నట్లే కనిపించలేదు. మరునాడు నన్ను చూసినపుడు ''ఏమిటోయ్! కట్నం వద్దన్నావుట? అంతంత ఆదర్శాలు నీకున్నట్లు మాకు తెలియనే తెలియదే?'' అన్నారు కొంచెం నవ్వుతూ. అందులో వ్యంగ్యం ఎంతో అంచనా వేయడం కష్టం.

''నాన్నా! నేను ఉద్యోగం చేస్తున్నాను కదా! తమ్ముళ్ల చదువూ, చెల్లెలి పెళ్లి''... అంటూ ఏదో చెప్పబోయాను.

''ఆ విషయాలేవీ నువ్వు ఆలోచించకు. నీకు ఎలా సంతోషమైతే అలా చెయ్యి.'' అన్నారు నాన్న. ఆయన అంత సీరియస్‌గా ఎప్పుడూ మాట్లాడరు. నేనేదో గిల్టీగా ఫీలవుతున్నాను. యీ ఆదర్శం నా హక్కు కాదేమో ననిపిస్తోంది.

''మీకు కష్టం కల్గించిఉంటే క్షమించండి నాన్నా!'' అన్నాను బాధగా.

''లేదు ప్రభాకరం. యీ కట్నాలు అవీ ఉండాలని నేనూ కోరుకోవడంలేదు. నిన్ను చదివించింది ఏదో కట్నం తెస్తావన్న ఆశతో కాదు. అది మా బాధ్యత కనుకనే చేశాం. కాకపోతే అందరిలాగే మనమూ ఉంటే, నీకు సంతోషంగానే కట్నం ఇచ్చేవాళ్లు ఉన్నారు. దానితో మన సమస్యలు కొన్ని తీరగలవు కూడాను. పోనీయ్, సరస్వతికి మాత్రం నీలాంటి ఆదర్శంగల యువకుడు దొరకకూడదా అదృష్టం ఉంటే? నిన్ను నిర్బంధించి కట్నం తెమ్మనేటంత కుసంస్కారం నాకు లేదు. ఇంక మిగతా బాధ్యతలంటావా! నీవు చేయగలిగినది చెయ్యి. ఎవరి అదృష్టం ఎలా ఉంటే అలా జరుగుతుంది... ఆ, మర్చిపోయాను. ముహూర్తం పెట్టుకోమని పాంబశివరావుగార్కి కబురంపించాను మీ చిన్నాన్నచేత'' అన్నారు.

నాన్నగారి విశాల హృదయానికి మనసులోనే జోహారులర్పించాను. నేను చేసినదానికంటే ఆయన దాన్ని అంత తేలికగా తీసుకోవటమే చాలగొప్పగా అనిపించింది నాకు.

ఇకపోతే మా అమ్మకూ, అక్కచెల్లెళ్లకూ నా నిర్ణయం చాల బాధనూ, నిరాశనూ కల్గించిందని గ్రహించడానికి ఎంతో సేపు పట్టలేదు. అమ్మ ఎంతో ప్రేమగా నా బుద్ధిలేనితనాన్ని నాకు తెలియచెప్పింది.

''ఒరేయ్ అక్క, చెల్లెలు కూడా ఆడబడుచు లాంఛనాలకోసం ఆశపడుతున్నారా. అయినా నీ కిదేం బుద్ధిరా! వాళ్లేమైనా గతిలేనివాళ్ళా! నీ దయాధర్మాలకోసం అర్థించారా! యివ్వగల్గిన వాళ్ళదగ్గర కట్నం పుచ్చుకొంటే తప్పేమిట్రా?'

ఈ సమస్యలన్నీ ఎదురౌతాయని నాకు ముందే తెలిసినా, అవి ఎదుర్కొంటున్నప్పుడు వాళ్లకే సమాధానమూ చెప్పలేకపోయాను. నేను కట్నంఅయితే వద్దన్నానుగానీ, వాళ్ళు ఆశిస్తున్న లాంఛనాలు అర్థంలేనివని చెప్పే అధికారం నాకు లేదనిపించింది. నేనే వాళ్లకు లాంఛనాల నిమిత్తం డబ్బు ఇస్తానని చెప్పాను.

''చాల్లే! నువ్వు ఇవ్వడంకోసమేనా ఏమిటి? నువ్వు ఇస్తే అది లాంఛన మెలా అవుతుంది?'' అంది సరస్వతి.

ఈ విషయాలన్నీ తెలిసి అసలు పెళ్లికి తను రావటంలేదని రాసిందట అక్కయ్య.

యివన్నీ తెలిసో, తెలియకో పెళ్లి ముహూర్తం ఇంకా వారంరోజు లుండనగా మాయింటికి వచ్చారు సాంబశివరావుగారు. మాటలలో అన్నారు మా అమ్మతో, "అమ్మా! అబ్బాయి కట్నం వద్దన్నాడనిగాని లేకపోతే మా శక్తికొద్దీ ఇచ్చేవాళ్లమే గదా! దానికీ ఇతర లాంఛనాలకూ సంబంధమేమిటి! ఆడ బడుచులు, అత్తగారి లాంఛనాల నిమిత్తం యీ రెండువేలూ ఉంచండి. మీ పెద్దమ్మాయి గారి కుటుంబాన్ని తప్పక రమ్మని వ్రాయండి. మిగిలిన మర్యాదల విషయంలోకూడా ఏలోపం జరుగదని హామీ ఇస్తున్నాను" అన్నారు.

నాకు ఏమిటో ఇబ్బందిగా వుంది. మా నాన్నగారు ఆ విషయం తనకేమీ పట్టనట్లు కూర్చున్నారు. అమ్మ తటపటా యిస్తూనే డబ్బున్న కవరు ఆయన మా సరస్వతి చేతులో పెట్టారు.

మొత్తంమీద ఏ గొడవలూ లేకుండా ఘనంగానే పెళ్లి జరిగిపోయింది. నేనుచేసిన ఘనకార్యానికి నన్ను పెద్దగా ఎవరూ అభినందించలేదు అలా ఆశించడమే నా పొర బాటు అనుకొన్నాను. మా మొదటిరోజు రాత్రి ...

సరోజ పూవులు జల్లిన మంచం మీద ఒక వారగా కూర్చొని ఉంది. నేను దగ్గరగా వెళ్లి ఆమె ముఖం నావంక తిప్పుకొన్నాను. ఆమె చిరునవ్వుతో నావైపు చూసి తల దించుకొంది. ఆమెతో నా జీవితం తప్పక ఆనందదాయకం కాగలదని నాకు మొదటి రోజునే నమ్మకం కలిగింది.

మూడురోజులూ మూడుక్షణాల్లా గడిచి పోయాయి, ఎన్నో విషయాలు మేము మాట్లాడుకొన్నా మా పెళ్లి విషయం, అంటే కట్నం విషయం ఒకసారికూడ ఆమె ఎత్తలేదు ఆ విషయంలో ఆమె తప్పక నన్ను అభినందిస్తుందని ఆశించిన నేను ఉండబట్టలేక అడిగేశాను.

"సరోజా నేను కట్నం తీసుకోనందుకు మీవాళ్లు ఏమనుకొన్నారు? నువ్వేమను కొన్నావు?"

ఆమెలో నేననుకొన్న రియాక్షనే మీ రాలేదు. కాగా, కొంచెం నిర్లిప్తంగా అంది, "ఏమనుకుంటారు? మీ కిష్టంలేని పని గనుక మీరు చేయలేదు. దాంట్లో అనుకోవ డానికేముంది?"

నేను నిరుత్సాహపడ్డాను.

"అంతేనా? కట్నం లేకుండా నేను నిన్ను చేసుకొన్నందుకు నీకేమీ గొప్పగా లేదూ? సంతోషంగా లేదూ?"

"డబ్బు ఖర్చు తగ్గినందుకు మావాళ్లు సంతోషించారేమో! అయినా అంత ఇవ్వలేని పరిస్థితులలో ఉంటేగదా బాధపడటానికి? ఇంక నా విషయమంటారా! మీరు కట్నం మానేస్తే నాకుగాని, మనకుగాని వచ్చిన లాభమేముంది? ఆ కారణంవల్ల మావాళ్లు ఒక్కచీర ఎక్కువగా కొనలేదు. మీవాళ్లు ఒక్క కాసు బంగారమయినా పెట్టలేదు." ఆమె ముఖంలో నిరాశ స్పష్టంగా కనిపిస్తోంది.

ఇది నేను ఊహించని పరిణామం. నేను తీసుకొన్న నిర్ణయంవల్ల ఆమె కుటుంబానికీ, ఆమెకూ ఎంతో ఆనందం కలిగిఉంటుందని ఆశించాను. కాని ఈ రకంగా ఎప్పుడూ ఆలోచించలేదు. ఆమెకు కలిగిన అసంతృప్తికి నాదే బాధ్యత అయితే అది తొలగించవలసిన బాధ్యత నాదేగదా?

ఆమె మళ్లీ అంది. "మీ రేదో లోకాన్ని ఉద్ధరించాననుకొంటున్నారు. కాని మీ ముందున్న బాధ్యతలు తీర్చుకోవటానికే మీ సంపాదనలో చాల భాగం వెనక వేయవలసి వస్తుందని, మన అవసరాలనూ, సరదాలనూ అన్నింటినీ చంపుకోవాలనీ నాకు అనుక్షణం గుర్తొస్తున్నది. మిమ్మల్ని విమర్శిస్తున్నాననుకోకండి. మిమ్మల్ని బాధించడం నా అభిమతం కాదు. నేను మీ భార్యగా మీ వద్దకు వచ్చిన తరువాత మా వాళ్లకు ఎంతడబ్బున్నా అది మనదవుతుందా? అందులో వాళ్లు సంతోషంగా నాకోసం ఖర్చుపెట్టదలచుకొన్న డబ్బు మీరు వద్దంటే — నిజమే-వాళ్లు సంతోషిస్తారు. కాని రేపెప్పుడయినా అవసరమయినా మనం అడగనూ లేము-వాళ్లకు ఇవ్వాలనీ ఉండదు."

"సరోజా! నీకు మీ కుటుంబ సభ్యురాలిగా అక్కడ ఎప్పుడూ హక్కు వుంటుంది. నేను కట్నం తీసుకోకపోయినా నీకు మీ నాన్నగారి ఆస్థిలో వాటా ఇవ్వ వచ్చుగదా?"

విచిత్రంగా నవ్వింది సరోజ "బలేగా అన్నారండి! నాకు కూడ వాటా యిమ్మని అడగమంటారా! నాలుగువేల కట్నంతో వదిలే దానికి నలభైవేల ఆస్తి యిస్తారా! ఇది జరిగే పనే నంటారా? ఈ వుద్దేశ్యంతోనే మీరు కట్నం వద్దనుకొంటే మీరు పొరబడ్డారనే చెప్పాలి."

"ఛ! ఛ! నేను ఆ వుద్దేశ్యంతో ఎంత మాత్రం అలా చేయలేదు. అసలు నా ఆదర్శం నిన్నుకూడ బాధిస్తుందని నేను కలలో కూడ అనుకోలేదు సరోజా!" నేను బాధపడుతున్నానని గ్రహించింది సరోజ. "నన్ను క్షమించండి మాట వచ్చింది కనుక అన్నాను కాని నేనేమీ బాధపడటం లేదు. ముందు ముందు ఎలా వుంటుందోనని మానాన్నగారు తను ఇద్దామనుకున్న అయిదువేలూ నా పేర బ్యాంకులో వేశారు. మీరు ఏ మాత్రం బాధపడ్డా ఆ డబ్బు మనం వాడుకోవద్దు. ఈ విషయం యింత వరకూ దాచినందుకు నన్ను మన్నించండి" అంది.

నాలో ఏదో లౌకిక జ్ఞాననేత్రం తెరచు కొంటున్నట్లు అనిపిస్తోంది. నా ఆశయానికి అర్థం లేదా! ఎక్కడుంది లోపం?



## ప్రశ్నావళి

(2వ పేజీ నుంచి)

**ఎం. వి. ఆర్. విశాఖపట్నం**

మీ రచయిత్రులంతా నాటికి తొంభయి పాళ్ళు వూహల్లో ఏవేవో వూహిస్తూ రిచ్‌లీ లైఫ్‌లను గురించి రాస్తూ ఉంటారు. గాని సామాన్యమైన మధ్య తరగతి జీవితాన్ని కథల్లో ఎన్నుకోరు.

నిజమే —అసలు మధ్య తరగతే మిధ్యా వాది కదా! బేషజానికి, అనవసరపు ఆడంబరాలకి, పోయి నేల విడిచి సాము చేస్తుంది — మధ్య తరగతి. ఈ తరగతి ఓట్ల లెక్కలకి, జనాభా పెంచడానికి తప్పించి సాంఘిక జీవన ప్రయోజనం ఏది సాధించింది?! అప్పు సప్పు చేయక కూలి నాలి చేసి సగర్వంగా బ్రతక్కూడదా? అప్పో సప్పో దర్జాగా చేసి మీ 'రిచ్‌లీ లైవ్' బ్రతక్కూడదా!

**ఎస్. ఎమ్. కె. రాజమండ్రి**

మీరు పాఠకులకిచ్చే జవాబుల్లో ఎక్కువగా ఆడవాళ్లను పొగుడుతూంటారు. ఏమికండి?

నాయనా మురళీకృష్ణా, యీ రోజుల్లో ఎవరి బాకా వాళ్లే వూదు కోకపోతే— ఎవరూ పట్టించుకోరు. అందుకని, (నేను దొంగపేరెట్టుకున్న ఆడదాన్ని కాదు కనుక)— నిజంగా ఉడవాళ్లని, నోరెట్టుకునాలా నెగ్గుకురాలేని వాళ్లని— కాస్త ప్రోత్సహించి చూస్తుంటాను.

**వి. ఎన్. ఆర్. విజయనగరం**

సృష్టికి మూలం ఏమిటి?
స్త్రీ.
మీ జీవితంలో మరువలేని సంఘటన?
ఇంకా ఏం జరిగినట్టు లేదు!

**ఇ. ఎస్. ఆర్. సూళ్ళూరుపేట**

ప్రశ్నకు సూటిగా జవాబియ్యక రావాయి అంతోపాటు చమత్కారంగా జవాబిస్తారు. ఇక నుంచి మీ అహంకారం తగ్గించుకొని ఉడికి ప్రశ్నకు జవాబియ్యండి. ఏమంటారు?

ఇంతకీ మీ ప్రశ్న ఏది? అంటాను.

**బి. ఎస్. ఎన్. వైజాగ్**

నాలుగు పేజీలు చదివేటప్పటికి అలసిపోతాను. ఇంక చదువెలా సాగుతుంది?

ఆ చదువేదే నవలే అయితే — మూసి పక్కన పెట్టండి. అది మీ క్లాసు పుస్తకం అయితే— లేచి ముఖం కడుక్కొనొచ్చి కూర్చోండి. (మనలో మాట! అలసిపోడానికి, బద్ధకించడానికి తేడా ఉంది. బద్ధకించి చదవడం మానేస్తున్నారేమో. కాస్త పర్యావలోకనం చేసుకోండి)

**సి. ఎస్. ఎమ్. వైజాగ్**

మా ఉత్తమమైన ప్రశ్నకు మీ చెత్త జవాబులు చదువుతూంటే అరికాలిమంట నెత్తికొస్తూంది. కాస్త జాగ్రత్తగా వ్రాయండి.

చిత్తం. అలాగే కాని అలా అరికాళ్ల మంట నెత్తికెక్కించుకోడం— ఆరోగ్య లక్షణం కాదుట. కొంచెం జాగ్రత్త.

**వై. ఎస్. ఆర్. తెనాలి**

నేను కామెంట్సు చేసే విద్యార్థులకి కుండ బద్దలు కొట్టినట్లు సమాధానం చెప్తాను. అందుకని నాకు భద్రకాళి అని బిరుదు యిచ్చారు.

చేతకానిది అనిపించుకొనేకంటే భద్రకాళి అనిపించుకోడమే మెరుగు చిట్టి తల్లీ.

## అవీ—ఇవీ—అన్నీ

### యువత

సాంస్కృతీ సమాఖ్య వారి ప్రథమ సంపుటి "యువత" జినేంద్ర కూర్పులో యువకుల రచనలో 42 పుటలతో వెలువడింది. ఇందులో పలు యువ రచయితల కథలు గేయాలు వున్నాయి. వివరాలకు ప్రతులకు వి శిరీష కుమార్ నున్న గ్రామం (వయా) విజయవాడకు వ్రాసి పొందవచ్చును

### నవచేతన

యువ సాహితీ వేదిక ఆంధ్రప్రదేశ్ వారి ఆధ్వర్యంలో కందుకూరి వేంకటేశ్వర్లు సంకలనం చేసిన కవితా సంకలనం మా కార్యాలయం చేరింది. వెల. 2 రు. ప్రతులు వలయు వారు సాందీపని పబ్లికేషన్స్, బస్సుపేట, మచిలీపట్నంకి వ్రాయవచ్చును.

### గెరిల్లా నాటక ప్రదర్శన

సుప్రసిద్ధ సినిమా, నాటక రచయిత శ్రీ సుంకర సత్యనారాయణ రచించిన తాజా నాటకం 'గెరిల్లా' యీ మధ్యనే విజయవాడలో చంద్రం డ్రమటిక్ అసోసియేషన్‌వారు ఎంతో బాగా ప్రదర్శించారు. రచన, నటన ఒకదానికొకటి రాణింపు నిచ్చాయి. దర్శకత్వం ఛన్నా ఎత్యం. నటీనటులు కె. లక్ష్మీకుమారి, వి వైదేహి, ఎ. వి. లక్ష్మి, ఎ. సత్యనారాయణ, ఎస్. బయ్యా, కె. సట్టాభిరామారావు,ఎస్. ఎ. గని, కె క్రసెడ్, బి. మస్తానప్ప, కె. నాగభూషణం, ఎస్. గారిబ్, ఎన్. సుధాకరరావు. డి. శ్రీరాములు, ఎం. సూర్యనారాయణ, బి. హెచ్ మోహన్‌కుమార్, సి. హెచ్. ప్రసాదు. కె ఎస్. శాస్త్రి, వగైరా.

# మీ సహకారంతో మేము మీకు అధిక సేవ చేయ గలము

| 1973-74లో ఎల్ ఐసి వారిచే చెల్లింపబడ్డ క్లైయిముల సంఖ్య | 1973-74లో ఎల్ ఐసి వారిచే చెల్లింపబడ్డ క్లైయిముల మొత్తం |
|---|---|
| 3.74 లక్షలు | రూ. 107.36 కోట్లు |

1973–74లో ఎల్ ఐసి తెలువబడిన మొత్తం క్లైయిములలో 79% పైగా పరిష్కరింపబడినవి. జాతీయం చేయకమునుపు ప్రవేటు ఇన్సూరర్ల కంటే ఈ రికార్డు చాలా బాగా ఉన్నది.

చాలా క్లైయిములు చెల్లింపబడకపోవటానికి కారణం, పాలసీ హోల్డర్లు లేదా వారి వారసులు ముఖ్యమైన సమాచారము, పాలసీ డాక్యుమెంట్లు, మరణ ఋజువు మరియు/లేక హక్కు ఋజువు మొదలైనవి, సకాలంలో ఇవ్వనందువల్ల. అయినప్పటికి ప్రతి పని దినము సుమారుగా 1250 క్లైయిములు సగటున రూ. 36 లక్షలు చెల్లింపబడినవి. అయినా మేము ఇంకా మెరుగు చేయాలనుకుంటున్నాము. మా పద్ధతులను బాగు చేస్తున్నాం—ఒక క్లైయిము పేమెంటు సర్వీస్—భారతదేశంలో ఇటువంటిది ఇది ఒక్కటే—ఏర్పరుపబడినది. క్లైయిముల చెల్లింపుకు అధిక ప్రాధాన్యము ఇవ్వబడినది.

త్వరగా క్లైయిములు పరిష్కరించుకోవటం మీ చేతుల్లోనే ఉన్నది. మీ పాలసీలో నమోదు చేసిన మీ వయస్సుని గురించి ఋజువు పరచటం, బెనిఫిషరికి వారసులని నియమించటం, చిరునామాలో ఏదైనా మార్పు ఉంటే ఎల్ ఐసికి తెలియ పర్చటం ద్వారా ఆలశ్యాలను అధిగమించండి.

జ్ఞాపకముంచుకోండి, ఎల్ ఐసి ఎప్పుడూ డిస్చార్జ్ వోచర్ ఒక నెల ముందుగానే పంపుతుంది. వెంటనే దాన్ని అన్ని వివరములతో నింపి మీ పాలసీ డాక్యుమెంటుతో, జారీ చేసిన ఆఫీసులో తిరిగి ఇవ్వండి.

మీ క్లైయిములు ఆలస్యమైనచో, దయచేసి, ఆ శాఖకు సంబంధించిన ఎల్ ఐసి ఆఫీసరును కలవండి—చివరిసారి మీరు డబ్బు చెల్లించిన ఎల్ ఐసి ఆఫీసులో. ఎప్పుడైనా సందేహాలు ఉంటే దయచేసి మీ ఏజంటుని లేదా మీ దగ్గరలోనున్న ఎల్ ఐసి ఆఫీసులో సలహా కొరకు సంప్రదించండి.

**మీ సహకారంతో మేము మీకు అధిక సేవ చేయగలము**



## లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా

RADEUS/LIC/AS 8

సీరియల్

# రాగవీచికలు

ఆదూరి

వేంకటసీతారామమూర్తి

*(గత సంచిక తరువాయి)*

స్నానాలూ టిఫిన్‌లూ అయ్యాక హాల్లోనే పడక కుర్చీలో కూర్చున్నారు మాధవరావుగారు. ఆ క్షణంలో శరీరానికీ మనసుకీ కూడ కొంత విశ్రాంతి లభించినట్లు తృప్తి పడ్డారాయన — పల్లెటూరి వాతావరణమని తప్పితే తమ వూళ్ళో తనకు సుఖం లేదు. వెంకట్రావు దగ్గర కూడ ఆయన కాస్తే సరిపడదు. చాలీచాలని కొంప అది— ఇకపోతే యిక్కడే ఆయనకు హాయనిపించేది — ప్రభుత్వంవారిచ్చిన యిల్లు కాబట్టి విశాలంగా ఎంతమంది వచ్చినా సరిపడేట్లు వుంటుంది. ఇంటికి తగ్గట్టు ఆధునిక సౌకర్యాలతో మరుగుదొడ్డి, స్నానాల గది — ప్రతి గదిలోనూ ఫంఖా వున్నాయి.

ప్రతి రోజూ తన యోగక్షేమాన్ని స్వయంగా కనుక్కుంటాడు రాజశేఖరం. "మీక్కావల్సినవన్నీ నేను తెస్తా నాన్నగారూ. మీ రెక్కడికీ వెళ్ళొద్దు — వేళపట్టున భోంచేసి విశ్రాంతి తీసుకోండి" అంటాడు తనిష్టప్రకారమే వంట చేసి పెడుతుంది కోడలు — అంతకంటె కావల్సిన వేమున్నాయి?

అప్రయత్నంగా మాధవరావుగారి దృష్టి గోడకున్న ఫోటో మీద పడింది ఎన్‌లార్జ్ చేసిన ఫోటో అది.

ఆఖరివాడు ఆనంద్ పుట్టిన అయిదేళ్ళకి గుంటూర్‌లో తనూ, మహాలక్ష్మమ్మగారూ తీయించుకున్న ఫోటో అది. ఎంత శ్రద్ధగా ఎన్‌లార్జ్ చేయించిపెట్టాడు?

మాధవరావుగారి మనసు ఆనందంతో పులకరించింది "అమ్మాయ్ విమలా — అబ్బాయి ఎప్పుడొస్తాడు?" కంచుగంట లాంటి ఆయన కంఠం ఖంగుమనేసరిక్కి వెనక గదిలో నున్న కోడలు మామగారి దగ్గిరకు వచ్చింది ఇంట్లో అడుగు పెట్టిన తర్వాత ఆయనిలా అడగటం యిది యే అయిదో సారో —

"సాయంత్రం మామూలు టైముకే వచ్చేస్తానన్నారు మామయ్యగారూ. ఆఫీసులో ఇన్‌స్పెక్షనేదో జరుగుతోందిట ఈ వారం రోజులూ చాల హడావుడిగా తిరుగుతున్నారు. ఈమధ్య ఆయన వచ్చేటప్పటికి రాత్రి పది కూడ దాటుతోంది. మీ రొస్తున్నారని యీ రోజు పెందరాడే వస్తామన్నారు" అంటూ మావగారి ముఖంలోకి చూసింది విమల

వాలు కుర్చీలో జేరగిలబడి కళ్ళు మూసుకున్నారాయన కొడుకుని చూడాలన్న ఆరాటం ఆయన ముఖంలో అస్పష్టంగా కన్పించింది.

* * *

గోడ గడియారం పది గంటలు కొట్టింది. మహాలక్ష్మమ్మగారు వంటింట్లో కూర్చుని వంటపని చూస్తున్నారు.

తలంటు పోసుకుని వున్నవాటిలో మంచి పరికిణా ఓణీ వేసుకుని తలారబెట్టుకుని ముందు గదిలో కిటికీ దగ్గర నిలబడి చిక్కు తీసుకుంటున్న వర్ధని మనసులో ఆలోచనలు రేగుతూనే వున్నాయి.

"యేవమ్మా వర్ధనీ యేం చేస్తున్నావ్" విమల మాటలకు లేచి నిల్చుని "యేం లేదత్తయ్యా" అంటూ తడబడింది.

"యేదో దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్... నేను చిక్కు తీయనేమిటి?" చనువుగా దగ్గర కొచ్చింది.

"వద్దత్తయ్యా — చిక్కు తీసేసుకున్నాను." అని, రెండు చేతులతోనూ జుట్టును సవరించి దగ్గరకు తీసి వేలుముడి వేసి జారుగా వదిలిపెట్టింది.

"అన్నట్లు నువ్వు యిల్లంతా చూడనేలేదు కదూ! పద చూద్దువుగాని."

విమల వెనుకే నడిచింది వర్ధని.

హాల్లో మాధవరావుగారు నిద్రలో వున్నారు.

హాలుకు రెండు ప్రక్కలా రెండు గదులున్నాయి. ఒకటి అతిధులకు కేటాయించినది. హాల్లోంచి లోపలకు వెళితే కుడివైపున పెద్ద గది. అదే కిచెన్. వంటకు వీలుగా ఎత్తుగా పెద్ద రాతి ఎల్ల అమర్చబడి వుంది. దానిమీద రెండు గేస్ స్టౌవ్‌లు వున్నాయి. అక్కడే కుడిచేతి పక్క నిలువెత్తు అల్మైరా గోడకు బిగించి వుంది. దానినిండా ఒకే సైజు ప్లాస్టిక్ డబ్బాలు నీటుగా సర్ది వున్నాయి రెండోమూల పెద్ద డైనింగ్ టేబిలూ, కుర్చీలు.

కిచెన్ కెదురుగా కుళాయి, స్నానాల గదీ వున్నాయి. ఇంటి వెనుకనున్న కొద్దిపాటి మట్టి జాగాలో ఒక మూలగా కరివేపాకు చెట్టూ అక్కడక్కడ అప్పుడే ఆకులు తొడుగుతున్న బచ్చలి మొక్కలూ వున్నాయి.

ముందు హాలుకూ వంట గదికీ మధ్య మేడ మీదికి పోయే మెట్లున్నాయి. మేడమీద సగానికి పైగా వదిలివేయబడిన డాబా, వెనుకను రెండు పెద్ద గదులూ వున్నాయి. రెండు గదుల్లోనూ ఒకటి రాజశేఖరంగారి ఆఫీసు గది. రెండోది పడక గది. తగినంత ఫర్నిచర్‌తో అందంగా వున్నాయా గదులు. ముందున్న డాబామీద నుంచి చూస్తే ఎత్తైన ప్రదేశాలూ కొండలూ అన్నీ సుందరంగా కన్పిస్తాయి.

ఇల్లంతా చూసిన తర్వాత కిందికి వచ్చి గదిలో కూర్చుంది వర్ధని, కాన్వెంట్ నుంచి తిరిగొచ్చిన మధుకి అన్నం పెట్టడానికి వంటింట్లో కెళ్ళింది విమల. హాల్లోనే ఓ మూల దిండు పడేసుకుని నడుం వాల్చారు మహాలక్ష్మమ్మగారు. మళ్ళీ వర్ధనిలో ఆలోచనలు మొదలయ్యాయి.

మామయ్య సాయంత్రంగాని రారు. పరిచయమున్న మామయ్యే అయినా వాళ్ళింట్లో కొంతకాలం వుండాలంటే ఏమిటో కొత్తగా అన్పిస్తోంది. అన్నయ్య దగ్గరుందామన్నా వాడుండేదే ఒక చిన్న గదిలోనట. అన్నయ్యను చూసే సంవత్సరం దాటిపోయింది వాడిని చూడాలని ఎంత ఆత్రంగా వుందో!

వర్ధనికి అకస్మాత్తుగా ధనం గుర్తుకొచ్చింది. ఆ మధుర జ్ఞాపకాలతోనే విశ్రాంతిగా కళ్ళు మూసుకుంది.

* * *

పడమటి ఆకాశం బంగారు రంగు పులుముకుంది. నీరెండ మిగిల్చిన కొద్దిపాటి వెలుగులో నగరమంతా కొత్త కొత్త అందాల్ని దిద్దుకుంటోంది.

వీధి గుమ్మంలో నిల్చుని పూలమొక్కల అందాల్ని కళ్ళతోనే తాగేస్తోంది వర్ధని. ఇంకో గంటలో విచ్చుకోబోయే సన్నజాజి మొగ్గలూ, ముళ్ళ మధ్యే పుట్టి అంతులేని అందాల్ని సంతరించుకున్న తెల్ల గులాబీలూ, ముగ్ధత్వాన్నంతా తమలో యిముడ్చుకున్న బంతీ చామంతీ, ఆమె మనసును మరో లోకంలో విహరింపజేస్తున్నాయి.

"అలా చూస్తూ నిల్చోకపోతే పువ్వులు కోసుకుని అత్తయ్యా, నువ్వూ పెట్టుకోరాదుటే" అంది మహాలక్ష్మమ్మగారు వీధిలోకి వచ్చి.

పూల అందాల్ని చూసి ఆనందించడమేగాని వాటిని తీగనుండి విడదీసి మాలలో బంధించి తలలో పెట్టుకోడమంటే యిష్టముండదు వర్ధనికి విమలకూడ అదే మనస్తత్వం కలది. అంతగా మనసుపడితే ఓ పువ్వు కోసుకుని తలలో పెట్టుకుంటుంది. అందుకే అత్తగారి మాట విన్నా అన్ని పువ్వులూ కోసేయవద్దని వర్ధనికి చాటుగా పిల్చి చెప్పింది.

వెండి పళ్ళెం తీసుకుని వీధి గుమ్మంలోకి వచ్చిన వర్ధని గేటు తీసుకుని లోపలికి వస్తున్న రాజశేఖరంగార్ని చూసి లోపలికి అడుగు వేసింది.

"నువ్వటమ్మా వర్ధనీ! ఎవరో అనుకున్నా" అన్నారాయన వాత్సల్యపూరితంగా. తనలోని పెద్దరికం మామయ్య కళ్ళబడినందుకు సిగ్గుతో తలొంచుకుంది వర్ధని.

"అమ్మా! తమ్ముళ్ళు బాగున్నారామ్మా."

"బాగున్నారు మామయ్యా!"

రాజశేఖరంగారు మరేమీ ప్రశ్నించకుండా లోపలికి వెళ్ళిపోయారు.

"వదినా! వదినా! నాన్న ఎందుకో నిన్ను

***జరిగిన కథ 1 :*** పుట్టి పెరిగిన వూరినీ, స్నేహితుల్నీ తల్లి మాణిక్యమ్మనీ వదిలి తాతయ్య మాధవరావుగారితో విశాఖపట్నంలోని మామయ్యగారింటికి వెళ్తుంది వర్ధని చదువు కోసం.

పిలుస్తున్నారు'' అంటూ వచ్చాడు మధు అరగంట తర్వాత.

లేచి నెమ్మదిగా మేడ మెట్లెక్కింది.

ముందు డాబా మీద వాలుకుర్చీలో కూర్చు న్నారు రాజశేఖరంగారు. ఆయన తప్ప మరెవరూ లేరని నిర్ధారించుకున్న తర్వాతగాని వర్ధనికి ధైర్యం కలగలేదు.

''రామ్మా కూర్చో'' అన్నారాయన ఎదురుగా నున్న కుర్చీ చూపించి.

''ఫర్వాలేదు మామయ్యా'' అంటూ కుర్చీ ప్రక్కనే పిట్టగోడ కానుకుని నిల్చుంది.

''మీ రొస్తున్నట్లు యీ రోజే ప్రసాద్‌కి ఫోన్ చేసి చెప్పానమ్మా. సాయంత్రం యేదో ఓటీ వుందట — రేపు వుదయం వస్తానన్నాడు.''

తను అడుగుదామనుకున్నది ఆయనే చెప్పడం, అన్నయ్య రేపు వస్తాడనటం వర్ధనికి చాల ఆనంద మనిపించింది.

''చూడమ్మా వర్ధనీ నీతో ఒక విషయం మాట్లాడా లనుకుంటున్నాను'' అంటూ వర్ధని ముఖంలోకి ఒకసారి చూసి కుర్చీలో సర్దుకుని కూర్చు న్నారు. సన్నని చీకటి నలువైపులా అలుముకుం టూంటే చల్లని పిల్లగాలి ఒళ్ళంతటిని తడిమి దూరంగా పారిపోయింది.

మామయ్య చెప్పేదేమిటో చూచాయగా గ్రహించగలిగింది వర్ధని.

''ఇంటినీ యిల్లాలినీ వదిలిపెట్టి బాధ్యతా రహితంగా తిరిగే మీ నాన్న గురించి నేను నీకు చెప్పేదేం లేదు. కానీ మీరుకూడ పెద్దవాళ్ళౌ తున్నారు — మీమీదే ఆశలు పెట్టుకున్న మీ అమ్మను సుఖపెట్టే బాధ్యత మీపైనే వుంది. నువ్వంటే ఆడపిల్లవి. రోజులు కలిసివచ్చి నీ పెళ్ళయితే మీ కుటుంబంలో సగం సమస్యలు సమసిపోయినట్లే— అన్నయ్య ఒక్కడూ మాత్రం యేం చేయగలడు? వాడి కొచ్చే జీతంలో యిందరిని పోషించే శక్తి వాడికి లేదు. ఇటువంటి పరిస్థితుల్లో నువ్వుకూడ మీ కుటుంబానికి కొంత ఆసరాగా నిలవాలనే నిన్నిక్కడకు రప్పించాను. సగంలో ఆగిపోయిన చదువును పూర్తి చెయ్యాలి ఆ పైన యే చిన్న వుద్యోగమైన దొరికితే యిటు ఆర్థిక సమస్యా మెరుగవుతుంది. అటు పెళ్ళికీ మరో అర్హత సంపాదించుకున్న దానివీ అవుతావు.''

అంతవరకూ చెప్పి వర్ధని ముఖంలోకి చూశా రాయన.

ఆనందం నిండిన కళ్ళతో వర్ధని ఆయనవంకే చూస్తోంది. తన మనసులోని కోర్కెకు నీరుపోసి పెంచి పెద్ద చేయగల శక్తి, పట్టుదల వున్న మామయ్యను చూసి ఆమెలోని ఆనందం పరవళ్ళు తొక్కింది తనూహించుకున్న వూహా సౌధాలన్నీ పేకమేడల్లా కూలిపోకుండా చేయగల శక్తి ఆయనకు తప్ప మరెవ్వరికీ లేదేమోననిపించిందా క్షణాన.

''ఏమమ్మా ఏవిటి నీ ఉద్దేశం?''

''ఈ విషయమై మొదట నేనే ప్రస్తావించా లనుకున్నాను మామయ్యా! నాకు చదువుకోవాలనే వుంది. కాని క్షణ క్షణానికీ ఎదురయ్యే యీ సమస్యలూ, ఆటంకాలూ మమ్మల్ని పరీక్షిస్తూ వుంటాయేమోనని భయంగానే వుంది.''

ఆమెలోని భయానికి కారణాలు వూహించక పోలేదాయన. మాధవరావుగారికీ విషయం మతరామూ యిష్టముండదు. అల్లుడి ప్రవర్తనతో ఆయనకు మనశ్శాంతి లేకుండా పోయింది. పల్లెటూరు, సొంతిల్లు అని కూర్చోబెట్టి గాని లేకుంటే ఏ కొడుకు దగ్గరున్నా ఆయన కడుపులో చల్ల కదలదు. ఎప్పటికైనా మనవరాలికి పెళ్లి చేసే బాధ్యత ఆయనదే. అల్లుడి మనసు స్థిరాన పడటం, మళ్ళీ వాళ్ళ కుటుంబం ఓ దారికి రావటం కలలోని విషయం. అందుకే—

''నాలుగడుగుల భూమి లేకపోయినా వోట్లో నాలుగక్షరం ముక్కలుండి నాలుగురాళ్ళు తెచ్చుకునే వాడి కెవడికైనా యిచ్చిపారేస్తా దాన్ని'' అని అందరిలోనూ వర్ధని విషయమై అనేవారు.

అటువంటప్పుడు రాజశేఖరంగారు వర్ధనిని దగ్గరుంచుకుని చదువు చెప్పించాలనుకోడం, చదు వయ్యాక వుద్యోగంలోకి చేర్పించడం ఆయనకెటూ యిష్టం వుండదు.

ఇక యీయన మాటలావున్నా నాలుగు రోజులకోసారి రంగారావు వచ్చేసి ''నా పిల్లలకు చదువులు చెప్పించడానికి మవ్వెవడవూ'' అంటూ విలదీసి నాలుగ్గంతులేసి నాలుగు పైసలు చేజిక్కించు కుని పారిపోయే ఆయన గురించి కూడ జంకు వుండనే వుంది.

ఈ విషయాలను గూర్చి రాజశేఖరంగారు ముందే ఊహించారు. ఏమైనాసరే యీ పనివల్ల ఆ కుటుంబం కొంత దారిన పడొచ్చుననుకుని ధైర్యంగా నిలబడ్డారు.

''కుటుంబ విషయాల గురించి నువ్వేం బాధ పడకమ్మా! అవెప్పుడూ వున్నవే. వాటి సంగతి



నాకొదిలెయ్యి. నువ్వుమాత్రం పట్టుదలగా ధైర్యంగా వుండాలి. తెల్సిందా !"

మామయ్య తనకిస్తున్న ధైర్యానికి మనసులోనే జోహార్లర్పించి "అలాగే మామయ్యా !" అంది.

ఆ రాత్రి పడుకున్నదేగాని వర్ధని మనసునిండా ఆలోచనలే. తన భవిష్యత్తుకు పూలబాటలు వేయాలని చూసిన మామయ్య నిజంగా దేముడనిపించింది. జీవితంలో మళ్ళీ రాదనుకున్న అవకాశం అనుకోకుండా ఎదురైంది. దీనిని వదులుకోకూడదు. పట్టుదలగా చదవాలి. నలుగురికీ ఉపయోగపడాలి. ఇలా అనుకుంటుంటే ఆమె మనసంతా ఆనందంతో నిండిపోయింది.

*4*

తూర్పు ఎర్రబడింది. ఉదయపు గాలి సముద్రంమీంచి రావటంవల్లనేమో చల్లగా హాయిగా వుంది. లేచి, బ్రష్ నోట్లో పెట్టుకుని మేడమీద నుంచే ఊరి అందాన్నంతా పరికించడం రజనీకాంత్ దినచర్యలో మొదటి భాగం.

దంతావధానం కానిచ్చి పాలవాడు పోసిన పాలనబడే నీళ్ళను స్టౌమీద పడేస్తూ చటుక్కున



గుర్తొచ్చి స్నేహితుణ్ణి లేపాడు.

తెల్లారగట్ట వచ్చిన కలను అసంపూర్తిగానే వదిలేసి ముసుగుతీసి లేచి కూర్చున్నాడు ప్రసాద్. వీధి కుళాయి దగ్గరనుండి చప్పుళ్ళు ధాటీగానే వినిపిస్తున్నాయి.

"తొలి కోడి కుయ్యగానే లేచుంటే యిప్పుడా లేవటం ?"

"ఆహాఁయ్ బడాయి – కోడి కూతకి లేచి యేం చేద్దామనుకున్నావ్ ?"

"దాంతోపాటు అరుద్దామనుకున్నాను." అంటూ లేచి కిటికీలో వున్న పళ్ళపొడిని ఎడంచేతిలో వేసుకుని బాత్ రూం వైపు నడిచాడు. పళ్ళు తోముకుని, ఆ చేత్తోటే నాలుగు చెంబుల నీళ్ళు వంటిమీద దిమ్మరించుకుని వచ్చేసరికి కాఫీ రడీగా వుంది.

"చెల్లాయిగార్ని చూసే సందడిలో వున్నట్లున్నారు. కాఫీ తాగుతారా లేక అక్కడే తాగాలనుకుంటున్నారా ?" అన్నాడు రజనీకాంత్ వంగ్య ధోరణిలో —

"పెట్రోల్ లేకపోతే మీ స్కూటరన్నా కదుల్తుందేమోగాని. కాఫీ లేకపోతే యీ ఘటం కదలదు." అంటూ రెండు గుక్కల్లో కాఫీ పూర్తిచేసి యిస్త్రీ చేసి ఎప్పట్నించో పెట్టెలో దాచుకున్న బట్టలు వేసుకున్నాడు. కాలరు సర్దుకుని, ముఖాని కింత పౌడర్ రాసుకుని వంకీలు రాని జుట్టుని వంకీ లొచ్చేట్టుగా త్రిప్పుకుని క్రాఫింగు దువ్వుకున్నాడు.

మంచం మీద కూర్చుని స్నేహితుడి వేషాన్ని చూస్తున్న రజనీకాంత్ వూరుకోలేకపోయాడు.

"కొంపదీసి పెళ్ళిచూపులు గూడ వున్నాయేమిటి రోజు"

"సర్లేండి – నేనేం మీలా టెరీకాట్ బట్ట లేసుకున్నానా ? ఫారెన్ వాచీలు పెట్టుకున్నానా ? అత్తర్లూ, హెయిరాయిల్సూ వాడానా ? నా కున్నవి నేను వేసుకున్నాను"

"అదే అదే – రోజూ అలా ఎందుకుండ కూడదూ అని ?"

"రోజూనా ? ఆ జీతానికీ ఆ పనికీ తెల్లబట్ట లొకటే తక్కువయ్యాయి."

"సర్లేగాని మళ్లీ ఎప్పుడు రావటం? పదకొండు దాటితే ఆత్మారావుడు ఆకలి కాగలేడు —"

"బహుశ రాలేనేమో" అన్నాడు ప్రసాద్ నవుగుతూ.

"నాకు తెల్సులే! యీపూట ఆవకాయ గోంగూరలతో విందుభోజనమే. అదృష్టమంటే అదీ !" రజనీకాంత్ అంటూంటే నవ్వి, బైట కొచ్చాడు ప్రసాద్

అప్పటికి ఎండ ఎర్రబడింది.

*     *     *

వర్ధనికి ఒకదగ్గర కాలు నిలవటంలేదు. తెల్లారి లేచింది మొదలు ఎన్నిసార్లు వీధిలోకి వెళ్ళి వచ్చిందో! రోజూకంటె ముందుగానే లేచి, స్నానం చేసి బట్టలు మార్చుకుంది. అప్పటికే విమల లేచి వుండటం మూలాన కాస్సేపు వంటింట్లో గడిపి మళ్ళీ తన గదిలోకి వచ్చింది. కిటికీ తెర తొలగించి చూస్తే రోడ్డుమీది మనుషులు కనిపిస్తారు. కాస్సేపు కిటికీగుండా చూసి విసుగెత్తి హాల్లోకొచ్చింది. ఆఫీసుకు వెళ్ళిపోవడానికై సిద్ధమై కుర్చీలో కూర్చుని యింగ్లీషు పేపరు చూస్తున్న రాజశేఖరంగారు చటుక్కున గుర్తొచ్చినట్లు మాధవరావుగారి వైపు తిరిగి "నిన్న ప్రసాద్‌కి ఫోన్‌చేశానన్నా ! యివాళ సెలవుపెట్టి వస్తానన్నాడు" అన్నారు.

"సెలవెందుకూ ? మేమెక్కడకుపోతాం గనుక ? ఆదివారం వస్తే సరిపోల్లా!" తాతగారి మాటలకు వర్ధని మనసు అదోలా అయ్యింది. అక్కడనుండి వీధిలోకి వెళ్ళటానికి సందేహించి మేడెక్కింది. లేత ఎండలో నగరమంతా బంగారంలా మెరిసిపోతూంది. దృష్టినంతా రోడ్డుపై నిలిపి చూడటం మొదలుపెట్టింది. రాజశేఖరంగారు ఆఫీసుకు వెళ్లిపోయారు. ఆయన వెళ్లిన మరో పది నిముషాలకు కర్రాడించుకుంటూ పాత స్నేహితుడి దగ్గరకు కాబోలు మాధవరావుగారు బయల్దేరారు.








రాజకీయాలు, దేశకాల మాన పరిస్థితులు, సినిమాలు మొదలైన ఏ అంశం మీదైనా కొంచెం ఆవేశంగా మాట్లాడే ఆందోళిత మనస్కుడైన పూనూరు గంగాధరరెడ్డి కథలూ, రేడియో నాటికలూ అవీ రాస్తూంటాడు. ఈ మధ్యనే వోటు వయసు, బి. కాం. డిగ్రీ రెండూ అందుకున్న యీ యువకుడు రాత్రి కళాశాలలో ఎం. కాం. చదువుతానంటున్నాడు. పగలు ఉద్యోగం దొరికితే చేద్దామనుకుంటున్నాడు. సినిమాలు చూడటం, దేశ పర్యటన చేయటం సర్దా. జర్నలిస్టులమీద ఎందుకో తెలియదుకాని గౌరవం. మంచి సినిమాలు రావటం లేదంటున్నాడు. "లోపభూయిష్టమైన విద్యావిధానం వల్ల మన వ్యవస్థ అవస్థపాలవుతున్నది. ఇది మారి ప్రాక్టికల్ ఎడ్యుకేషన్ కావాలి" అంటున్నాడు. అతని దృష్టిలో "పరీక్షలు తెలివితేటలకి కొలత బద్దలు కావు." ఇంకా ఆవేశంగా "రిజర్వేషన్‌లు, పెరుగుతున్నమేధా సంపత్తికి కత్తిపోట్లాయి, తెలివైన విద్యార్థికి వెన్నుపోట్లయి పోతున్నాయన్న ఆవేదన వ్యక్తం చేస్తూ యువతీ యువకులు తమ తమ సమస్యలు తామే చదువుకుంటూనే పరిష్కరించుకోవాలి అన్నాడు. ఆధునిక కవిత్వం మీద గురి వున్నవాడు కూడా...

గుంటూరు జె.కె.పి. కాలేజీ స్టూడెంటు, గుడివాడ తాలూకా యువకుడు. రాజకీయాల పరిజ్ఞానం యువతరానికి వుండాలని నమ్ముతున్నాడు. గంగాధరరెడ్డి వాలీబాల్, బాస్కెట్‌బాల్ అవీ ఆడుతానని చెప్పాడు. లెక్చరర్‌లతోనూ, పెద్దపెద్దవాళ్లతోను కలుపుగోలుతనంగా తిరగాలని, వాళ్లతో చర్చించాలని ఉబలాటపడుతూండే ఈ యువకుడు – ప్రశ్నలకి సమాధానాలు ఆవేశంతోను, ఉద్వేగంగాను యిస్తున్నాడు. "యువకులు నవభారత సౌధానికి పునాదిరాళ్ళు ! వారు పిలిస్తే పలుకుతాయి లక్షల నోళ్ళు, వారు నడిస్తే నడుస్తాయి లక్షల ఊళ్లు. వీరి తెలివికి పదునుపెట్టి, వీరి వెన్నుతట్టి వీర్ని ముందుకు నడిపితే 'అవినీతి' పారిపోతుంది. అన్యాయం అదిరిపోతుంది" అన్నవి అతని మాటలు. ఏమేమో చేసేయాలని ఉబలాట పడుతున్న ఈ యువకుడి మాటల్లో యువతరానికో వెన్నుతట్టే 'నాయకత్వం' కావాలన్న 'ధ్వని' వున్నది ... అది ఆలోచించదగ్గదే...

[ వి ]

## "ద్రౌపది" నిర్మాణ కోలాహలం

రాజ్యం పిక్చర్స్ తలపెట్టిన "ద్రౌపది" వర్ణ చిత్రానికిగాను, ప్రతి రోజూ నాగేశ్వరపురంలోని ఆఫీసులో దర్శకుడు కామేశ్వరరావు, రచయిత సముద్రాల, నిర్మాతలు శ్రీధరరావు – లక్ష్మీరాజ్యం, కళా దర్శకుడు గోఖలే చర్చ జరుపుతూ వున్నారు.

ఆగస్టు 15న, సాంగ్ రికార్డింగ్ జరపడానికి నిశ్చయించినట్టు, నిర్మాత శ్రీధరరావు చెప్పారు. ఈ చిత్రానికి ఆదినారాయణరావు సంగీత దర్శకుడు.

"ద్రౌపది" చిత్రంలో కృష్ణుడుగా 'నటరత్న' రామారావు, పాంచాలిగా వాణిశ్రీ నటిస్తారు. మహాభారత అతిరథ, మహారథ, అర్ధరథ పాత్రలను తెలుగు తెర యోధానుయోధులు పోషించగలరు.

పౌరాణిక చిత్రాలను ప్రేక్షక జనరంజకంగా



"చిట్టెమ్మ—చిలకమ్మ" లో
మురళీమోహన్, మనందిని

నిర్మించే మేధస్సు రాజ్యం పిక్చర్స్‌కు గలదు అనేది అభిప్రాయం ప్రేక్షకులకు తెలుసు గనక, "ద్రౌపది" చిత్రం నవరసభరితంగా వుండగలదని ఆశించవచ్చు.

## "అమ్మా - నాన్న"

రవీంద్రా ఆర్ట్ పిక్చర్స్ నిర్మిస్తున్న చిత్రానికి "పెళ్లికాని తల్లి"కి మారుగా "అమ్మా—నాన్న" అని పేరు పెట్టినట్టు, నిర్మాత తమ్మారెడ్డి కృష్ణమూర్తి పత్రికా సమావేశంలో వెల్లడించారు.

డాక్టరుగా కృష్ణంరాజు వుదాత్తమైన పాత్రను పోషిస్తున్న "అమ్మా—నాన్న" చిత్రంలో ప్రభ, జయసుధ, రమాప్రభ, నిర్మల, చంద్రమోహన్, రాజబాబు, సాక్షి రంగారావు, కాకరాల ప్రధాన తారాగణం.

విఖ్యాత నవలా రచయిత్రి యద్దనపూడి సులోచనారాణి కథకు, పినిశెట్టి మాటలను రాశారు.

ఈ చిత్రానికి లెనిన్‌బాబు దర్శకుడు. పాటల చిత్రీకరణలో ప్రత్యేకత వున్న ప్రతిభావంతుడు. సంగీతానికి చలపతిరావు, ఛాయకు కృష్ణారావు, కూర్పుకు సంజీవి అధిపతులు.

ఎన్నో మాణిక్యాలను అందించిన తమ్మారెడ్డి



# సినిమా విశేషాలు

కృష్ణమూర్తి నిర్మిస్తున్న అమూల్యమైన చిత్రం "అమ్మా—నాన్న"కు ప్రేక్షకాదరణ లభించగలదు.

## నోమును మించిన పూజ

ఏ. వి. ఎమ్. నిర్మించిన "నోము" చిత్రం ఆర్జించిన ప్రేక్షకాదరణకన్న మిన్నగా "పూజ" చిత్రం సంపాదించగల యోగ్యతను, అర్హతను బడసియున్నట్టు రషస్ చూచినవాళ్లు అభిప్రాయ పడుతున్నారు.

"పూజ" చిత్రానికి వాణిశ్రీ నటన హైలైట్. అలాగే రామకృష్ణ పాత్రపోషణ చక్కగా వున్నది. సహాయ పాత్రలను సావిత్రి, కాంతారావు, కన్నడ మంజుల, కె. వి. చలం, చంద్రమోహన్, మిక్కిలినేని సమర్థవంతంగా పోషించారు.

"పూజ" చిత్రంలో పాటలన్నీ పాపులర్ అయ్యే విధంగా రాజన్—నాగేంద్ర సంగీతాన్ని సమకూర్చారు.

కన్నడంలో బహుళ ప్రేక్షకాదరణ పొందిన "యరడు కనసు" చిత్రం యొక్క ప్రతిరూపమే "పూజ" చిత్రం. ఈ చిత్రాన్ని కుమరన్ – మురుగన్ సర్వజనరంజకంగా రూపొందించారు.

గత ఏడు "నోము" చిత్రం కనకవర్షం కురిపించినట్టె, యీ ఏడు "పూజ" చిత్రం ధన వర్షం కురిపించగలదు.

## జడ్జిగా సావిత్రి

ఒకప్పుడు సావిత్రి "ది బెస్ట్ హీరోయిన్". ఇప్పుడు "ది బెస్ట్ గెస్ట్ ఆర్టిస్ట్".

ఈ మధ్య ఆవిడను రెండు చిత్రాలలో చూశాను. ఒక ప్రక్క అనుభూతి, మరొక ప్రక్క సానుభూతి ఏర్పడక తప్పిందికాదు.

ఏ. వి. కె. ప్రొడక్షన్స్‌వారి "లక్ష్మణ రేఖ" చిత్రంలో సావిత్రి జడ్జిగా నటించింది. అనంతలక్ష్మి కంబైన్స్‌వారి "ఈ కాలపు పిల్లలు" చిత్రంలో



"ముత్యాల ముగ్గు"లో సంగీత

హీరో రామకృష్ణకు తల్లిగా నటించింది.

నటించింది కొద్దిసేపే అయినా, మనసులో నిలిచిపోయే విధంగా సావిత్రి రెండు చిత్రాలలోని పాత్రలను పోషించింది.

ఏ. వి. ఎమ్. వారి "పూజ" వర్ణ చిత్రంలో సావిత్రి పాత్ర ప్రేక్షకులను ఆకర్షించగలదు.

ఆనాటి సావిత్రిని ఏనాటికైనా అధిగమించే నటి తెలుగు తెరకు లభిస్తుందా అంటే... సందేహమే సమాధానం అవుతుంది.



"అమ్మా—నాన్న"లో
కృష్ణంరాజు, ప్రభ

## సినిమా

### తండ్రిగా రామ, కొడుకుగా కృష్ణ

శ్రీ రాజ్యలక్ష్మి చిత్ర వారి "ఆస్తికోసం" చిత్రం పూర్తయింది ఈ చిత్రానికి గిడుతూరి సూర్యం దర్శకుడు

స్వర్గీయ డాక్టర్ రాజారావుగారి అబ్బాయి పృథ్వీ నిర్మించిన "ఆస్తికోసం" చిత్రం అందరినీ ఆకర్షించగలదట ఈ చిత్రంలో రామకృష్ణ తండ్రిగా, కొడుకుగా ద్విపాత్రాభినయం చేశారు

ఇదే చిత్రంలో న్యాయాన్ని, ధర్మాన్ని రక్షించే నిమిత్తం రామకృష్ణ అనేక మారువేషాలను ధరించారు ఈ చిత్రంలోని ప్రధాన పాత్రలను ప్రమీల, గిరిబాబు, త్యాగరాజు, పండరీబాయి, రావుగోపాలరావు, రాజనాల, కె వి చలం, కాకరాల, భీమరాజు, జయమాలిని, గిరిజారాణి, బాలకృష్ణ, కె కె శర్మ పోషించారు

"ఆస్తికోసం" కథను పినిశెట్టి యివ్వ, మాటలను దాసం గోపాలకృష్ణ రాశారు సంగీతానికి హనుమంతరావు, కళకు భాస్కరరాజు, ఛాయకు కె ఎస్ మణి, కూర్పుకు బాలు అధినేతలు

చిత్రం ఆద్యంతం రామకృష్ణ పాత్రలకు ప్రాముఖ్యత, పలుకుబడి వున్న నిజాన్ని ప్రేక్షకులు గ్రహించగలరు ఈ చిత్రానికి దాసరి సత్యనారాయణ మూర్తి సమర్పకుడు వేగి వీరరాజు మరొక నిర్మాత

### పాలేరుగా రామకృష్ణ

శివాజీ ఆర్ట్సు వారి "పూర్ణమ్మ కథ"లో రామకృష్ణది వెరైటీ వేషం పాలేరుగా, మంచిని పెంచే ఉత్తమ పౌరుడుగా రామకృష్ణ నటిస్తున్నారు చెల్లెల్లాంటి పూర్ణమ్మతో సమాజం అక్రమ సంబంధం వున్నట్టు ప్రచారంచేస్తే, వాళ్ల నోరు మూసి, కళ్లు తెరిపించి 'స్త్రీ' యొక్క పవిత్రతను తెలియచేసిన సంస్కారిగా రామకృష్ణ నటిస్తున్నారు

"ఓ సీత కథ" చిత్రం తెచ్చిన పేరుకు ఏమాత్రం తగ్గకుండా, "పూర్ణమ్మ కథ" చిత్రం రోజారమణికి ప్రతిష్ఠను తెచ్చిపెట్టగలదు

"పూర్ణమ్మ కథ" చిత్రాన్ని చూచినవాళ్లు, నందనరావు పవిత్రతను ప్రశంసించారు ఈ చిత్రంలోని ముఖ్య పాత్రలను నాగేష్, ప్రభాకరరెడ్డి, ధూళిపాళ, అల్లు రామలింగయ్య, అనిత, ఛాయాదేవి, మాడా పోషిస్తున్నారు

సాంకేతిక శాఖలను సాలూరి హనుమంతరావు, భాస్కరరాజు, సెల్వం, సుబ్బారావు, బండ్రెడ్డి నరశింహారావు నిర్వహిస్తున్నారు ఈ చిత్రానికి మద్ది బసవరాజు, తుమ్మపూడి నాగేశ్వరరావు నిర్మాతలు



"పెద్దింటి కోడలు"లో ఒక దృశ్యం

### కన్న ప్రేమ - పెంచిన ప్రేమ ?

ఈ రెండిట్లో ఏది గొప్పది అనేది అంశంపై అల్లబడిన ఒక సమస్యాత్మకమైన కథను కాకతీయ మూవీస్‌వారు సంచలనాత్మక చిత్రంగా నిర్మిస్తున్నారు ఈ చిత్రానికి సి ఎస్ రావ్ దర్శకుడు సినియర్‌గా పని చేసే సి ఎస్ రావు ఎంతటి ప్రతిభావంతుడో ప్రేక్షక లోకానికి తెలుసు

తమది కాని బిడ్డను ప్రాణప్రదంగా పెంచిన ముగ్గురమ్మలు ఆ బిడ్డ తమకు దూరమైనప్పుడు పడిన బాధ, ఆరాటం, ఆవేదనల ప్రతిరూపమే కాకతీయ మూవీస్‌వారి చిత్ర కథ ఈ చిత్రానికి ఎ రామారెడ్డి నిర్మాత

"ప్రమీల – జయంతి – నిర్మల" ప్రధాన పాత్రలను పోషిస్తున్న యీ చిత్రంలో చంద్రమోహన్, శ్రీధర్, కాంతారావు, ప్రభాకరరెడ్డి, రాజనాల, ధూళిపాళ, బేబీరోహిణి, ప్రసాద్ సహ భూమికలను ధరిస్తున్నారు ఈ చిత్రానికి కె వి మహదేవన్ సంగీత సారధి ఇప్పటివరకు రికార్డు అయిన మూడు పాటలు, ముచ్చటగా వున్నాయి

విచిత్రమైన సంఘటనలతో, ఆసక్తిని, అనురక్తిని కలిగించే సన్నివేశాలతో, ప్రేక్షకులకు కొత్త రసానుభూతిని కలిగించే యీ చిత్రానికి కథ, సినిమా అనువాదం, దర్శకత్వంను సి ఎస్ రావ్ నిర్వహిస్తున్నారు



సాంకేతిక శాఖలకు సముద్రాల, పి ఎస్ ప్రకాష్, అంకిరెడ్డి, ఈశ్వరమను ఆధిపత్యం వహిస్తున్నారు

ఈ చిత్రం పదిరీళ్లు తయారైంది

### సి. ఎస్. రావ్ జీనియస్

అని నిరూపించే విధంగా పూర్ణిమా పిక్చర్స్ వారి వర్ణ చిత్రం రూపం అందుకుంది ఈ చిత్రానికి "దేవుడు లాంటి మనిషి" అని పేరు పెట్టడం జరిగింది

అక్కయ్య కుటుంబం కోసం, అనితర సాధ్యమైన త్యాగాన్ని తలపెట్టిన తమ్ముడి కథ యిది ఈ చిత్రానికి డి వి నరసరాజు సంభాషణల రచయిత ఆయన కలం ప్రతి సన్నివేశానికి జీవం పోసింది

"దేవుడు లాంటి మనిషి" చిత్రంలో అక్కయ్యగా నటించిన "షావుకారు" జానకిని అద్భుతమని, అద్వితీయమని, అసమానమని ప్రశంసిస్తున్నారు తమ్ముడుగా కృష్ణ నటన 'ఏ' వన్ అంటున్నారు గ్లామర్‌కు మంజుల వుండనేవుంది' సహాయ పాత్రలను నాగభూషణం, రాజబాబు, చంద్రమోహన్, వెన్నిరఆడై నిర్మల, శ్రీదేవి పోషించారు

సాంకేతిక శాఖలను నిర్వహించిన మహదేవన్, జి కె రాము, సి ఎస్ రావ్, డి వి నరసరాజుగార్ల ప్రతిభను గూర్చి ప్రత్యేకంగా పేర్కొనాలి

"కృష్ణాంజనేయ యుద్ధం" చిత్రాన్ని అందించిన డి ఎస్ రాజు నిర్మించిన రెండవ చిత్రం "దేవుడు లాంటి మనిషి"


''పిచ్చిమారాజు''లో శోభన్

***పిచ్చిమారాజు సగం పూర్తి***

జగపతి స్టాఫ్ ఎంటర్‌ప్రైజస్ రంగుల్లో నిర్మిస్తున్న ''పిచ్చిమారాజు'' చిత్రం జులై 7 నుంచి 12 వరకు జరిగిన షూటింగుతో సగం పూర్తయింది

ఈ షెడ్యూలులో పతాకసన్నివేశం చిత్రీకరించ బడింది హీరో శోభన్‌బాబు దుష్టద్వయం అల్లు రామలింగయ్య,ధూళిపాళ గార్లను ఏడిపించిన ''చక్ బొప్పాయిగుండూ'' పాట చిత్రీకరణ జరిగింది

మూడు లక్షలు ఖర్చెట్టిన సెట్లో ''పిచ్చి మారాజు'' చిత్రం తాలూకు ఇన్‌డోర్ పూర్తయింది

జగపతి అధినేత ''పిచ్చిమారాజు'' తెలుగు చిత్రంతోబాటు, తమిళ చిత్రం అవుట్‌డోర్‌ను కూడా ఒకేసారి తలపెట్టిన కారణంగా, కాశ్మీరు పయనాన్ని అక్టోబరులో పెట్టుకొన్నారు

''పిచ్చిమారాజు'' చిత్రంలోని పాటలు ''దసరా బుల్లోడు'' చిత్రంలోని పాటలకంటె పదిరెట్లు మధురంగా వున్నాయనడం తక్కువేమో అనిపిస్తుంది స్టాఫ్‌కోసంరాజేంద్రప్రసాద్‌గారు నిర్మిస్తున్న యీచిత్రం వసూళ్లలో ఫుల్‌స్టాప్‌నుచూడకపోవచ్చు

***ఏ కొట్టు కేగినా యివే పాటలా ?***

ఈ మధ్య ఆంధ్రదేశం ప్రదక్షిణం చేసివచ్చాను అలా చేసేటప్పుడు, నే వెళ్ళిన ప్రతి వూరి కొట్టు దగ్గరికి వెళ్ళి, కాసేపు నిలబడేవాడ్ని

ఎక్కడ విన్నా, ''జేబుదొంగ'' చిత్రంలోని పాటలే శ్రోతలు ఎక్కువ యిష్టపడుతున్నారన్న నిజాన్ని తెలుసుకొన్నాను

''జేబుదొంగ'' చిత్రంలోని పాటలను పాపులర్ చేసిన చక్రవర్తిని అభినందించారు శ్రోతలను ఎక్కువగా ఆకట్టుకున్న పాటలు మూడు

''నీలాల నింగిలో — మేఘాల తేరులో

ఆ పాల పుంతలో — నీ కౌగిలింతలో'' అనెడి బాలు — సుశీల పాడిన డ్యూయెట్టుకు మొదటి మార్కు లిచ్చారు. ఈ పాట శోభన్ — మంజులపై చిత్రీకరించారు.

''రాధా, అందించు నీ లేత పెదవి

గోపీ, లాలించి తీరాల తనివి'' అనెడి సుశీల—బాలు పాడిన డ్యూయెట్టుకు రెండవ స్థానాన్ని యిచ్చారు ఇది మురళీమోహన్ - రోజారమణిపై చిత్రీకరించబడింది

''గోవిందా! గోవింద

గుట్టుకాస్త గోవింద'' పాటకు తృతీయ స్థానాన్ని యిచ్చారు సంగీత జ్ఞానం తెలిసిన వ్యక్తులు మిగతా పాటలు కూడా వినసొంపుగానే వున్నాయి

***విశ్వనాథ్ కథకు శోభన్ నాయకుడు***

సత్య చిత్ర అందించిన మొదటి చిత్రం ''తాసిల్దారుగారి అమ్మాయి'' అందరిచేత ప్రశంసించ బడడమే గాక, ఎన్నో అవార్డులను ఆర్జించిన విషయం పాఠకులకు తెలియనిదికాదు

మంచి కథకోసం రెండు సంవత్సరాలు ఆగిన నిర్మాతలు సత్యనారాయణ, సూర్యనారాయణగార్లకు, విశ్వనాథ్ గారిచ్చిన కథ నచ్చింది

ప్రజలచేత అగ్ర దర్శకుడుగా పేరందుకున్న విశ్వనాథ్ సత్య చిత్ర వారి ద్వితీయ చిత్రానికి దర్శకత్వాన్ని అంగీకరించారు కథానాయకుడుగా ''హీ—మాన్'' (శోభన్) నటిస్తున్నారు ప్రధాన పాత్రలను 'షావుకారు' జానకి, లక్ష్మి, జయప్రద పోషిస్తున్నారు

సంగీతానికి మహదేవన్, ఛాయాగ్రహణానికి జి కె రాము, రచనకు గొల్లపూడి అధిపతులు

ఆగస్టులో పాటలన్నీ రికార్డింగ్ చెయ్యాలని నిర్ణయించారు. సెప్టెంబరు చివరివారం నుంచి షూటింగు ప్రారంభమవుతుంది.


'ఆడవాళ్ళు — అపనిందలు''లో ఒక దృశ్యం

# సినిమా



"పూజ"లో వాణిశ్రీ

### జనవరి నుంచి అక్కినేని బిజీ

"నటసామ్రాట్" నాగేశ్వరరావు రాబోయే జనవరి నుంచి చాలా బిజీగా వుండగలరు. జులై 15 న "మహాకవి క్షేత్రయ్య"గా మేకప్ వేసినప్పుడు, అక్కినేనిలో కొత్త అందం అగుపించింది. యవ్వనం అక్కినేని సొంతమేమో అనిపించింది. నిన్న, మొన్నటి ప్రభ ప్రక్కన ఆయన డ్యూయెట్లు పాడుతుంటె, 'చిలకా—గోరింక'ల వలె కనిపించింది.

"మహాకవి క్షేత్రయ్య" సంక్రాంతి కానుకగా విడుదలవుతుంది.

జనవరి నుంచి అక్కినేని నటించే చిత్రాలు "అన్నపూర్ణా సినీ స్టుడియో, హైద్రాబాద్" లో జరుగుతాయి.

జగపతి రాజేంద్రప్రసాద్‌గారి బంగారు బొమ్మలు, సురేష్ రామానాయుడిగారి సెక్రటరి, కౌముదీ రెడ్డిగారి సాంఘికం, దుక్కిపాటి మధుసూదనరావుగారి సాంఘికం, పి. ఏ. పి. సుబ్బారావుగారి సాంఘికం షెడ్యూలు ప్రకారం ప్రారంభమవుతాయి.

పై నుదహరించినవి గాక, మరో అరడజను మందికి అక్కినేని తన అంగీకారాన్ని తెలిపారు. అట్టివారిలో "క్యారెక్టర్ ఆర్టిస్ట్" ఒకరున్నారు.

### కన్నప్ప పాత్ర ఎంపిక

సాంఘిక చిత్రాల నాయకుడు, శృంగార చిత్రాల నాయకుడు అని ప్రజలచేత కీర్తింపబడుతున్న కృష్ణంరాజు ఏమిటి? భక్త కన్నప్ప పాత్రను ఎంపిక చెయ్యడమేమిటి? అనేడి సంశయం కొందరికి జనించకపోదు.

"మానవ సేవే మాధవ సేవ" అనేడి సిద్ధాంతాన్ని నమ్మిన వ్యక్తి తిన్నడు అవడంచేత, మారుతున్న సమాజాన్ని విప్లవ ధోరణిలో నడిపించడానికి ప్రయత్నించిన మానవోత్తముడు తిన్నడు గనక, కృష్ణంరాజుకు ఆ పాత్ర పోషణపట్ల ఆసక్తి కలిగింది.

ఈ మధ్య "భక్త కన్నప్ప" చిత్రం యొక్క ట్రీట్‌మెంటును విన్నాను. "ఇట్ ఈజ్ సింప్లీ సుపర్బ్" అనిపించింది.

ట్రీట్‌మెంటు విన్నప్పుడే, అంత థ్రిల్ వుంటే, చిత్రం పూర్తయిన తరువాత ఎంత వుండగలదో!

ఈ చిత్రానికి విక్టరీ, సత్యానంద్, స్వామి, ఆదినారాయణరావు – సత్యం, వాలి వంటి మేధావులు పని చేస్తున్నారాయె!

కృష్ణంరాజు ఎంపికను ప్రేక్షకులు హర్షించగలరు.

### "నారద వినోదం"

ఫల్గుణా కంబైన్స్ తలపెట్టిన వినోదభరిత పౌరాణికం "నారద వినోదం". ఈ చిత్రాన్ని ఏకామ్రేశ్వరరావు కన్నడం నుంచి తెలుగులోకి అనువదిస్తున్నారు.

### రాజకుమార్ ద్విపాత్రాభినయం

కన్నడ రంగపు నటరాజు రాజకుమార్ నారదుడుగా, కృష్ణుడుగా ద్విపాత్రాభినయం చెయ్యడం యీ చిత్రంలోని ప్రత్యేకత.

ఈ చిత్రంలోని స్త్రీ పాత్రలను జయంతి, కన్నడ మంజుల, హారతి, లీలావతి మున్నగు పేరు మోసిన తారలు పోషించారు.

ఇందులో "అష్ట లక్ష్మీవ్రతం" మహిళా లోకానికి స్పెషల్ గిఫ్ట్‌గా వుండగలదు.

నారదమహర్షి జీవితాన్ని, సరికొత్త పంథాలో ట్రీట్ చేసిన సంవిధానం కన్నడ ప్రేక్షకులకు నచ్చినట్టే, తెలుగువాళ్లకు నచ్చగలదన్న నమ్మకం ఫల్గుణా అధినేతకు వున్నది. ఈ చిత్రానికి వై. ఆర్. స్వామి దర్శకత్వాన్ని, కుదరవల్లి కళా దర్శకత్వాన్ని, మధు ఛాయాగ్రహణాన్ని, సుదర్శనం సంగీతాన్ని నిర్వహించారు.

### అగ్రనటి యింట రవిరాజ్ అధినేత

గతవారం వాణిశ్రీ యింటికి వెళ్లాను. ఆవిడ లేదు. బెంగుళూరులో తమిళ చిత్రం షూటింగులో వున్నట్లు ఆవిడ బావ రాజుగారు చెప్పారు. ఇక వెళ్దామని బయల్దేరబోతుంటె, రవిరాజ్ కంబైన్స్ అధినేత కేశన జయరామ్, అక్కడికి వచ్చారు.

ఆయన నిర్మించిన "సంతానం—సౌభాగ్యం" చిత్రం బాగా వున్నదని నాకందిన సమాచారాన్ని తెల్పి, అభినందిస్తూ తర్వాతి చిత్రం గూర్చి ప్రశ్నించాను.

వాణిశ్రీ, సత్యనారాయణగార్లతో చిత్రాన్ని తలపెట్టినట్లు, చెప్పారు. తన దగ్గరున్న కథకు వాణిశ్రీ మాత్రమే న్యాయం చేకూర్చగలదన్న అభిప్రాయం జయరామ్‌కు వున్నది.

రవిరాజ్ సంస్థపట్ల అగ్రనటికి ప్రత్యేకమైన అభిమానం వుండబట్టే, 'మరపురాని తల్లి' చిత్రానికి తన పేరును అరువిచ్చింది. రవిరాజ్ అధినేతకు, అగ్రనటి ఆమోదముద్ర లభించగలదు.

### తెర జీవితంలో ప్రమీల ఆఖరి ఘట్టం

"జీవిత రంగం" చిత్రం ద్వారా తెలుగు ప్రేక్షకులకు దగ్గరి చుట్టమైన ప్రమీల, "అభిమానవతి" చిత్రంలో ఆత్మబంధువుగా సన్నిహితురాలైంది. వర్త్ వున్న నటిగా ప్రేక్షకులు ప్రమీలను గుర్తించారు. గ్లామర్ నటిగా యువకుల గుండెల్లో పన్నీటి జల్లును ప్రమీల కురిపించింది.

ఒక రోజు ప్రమీల దగ్గర్నుంచి ఆహ్వాన పత్రిక వచ్చింది. పాత్రికేయులందరూ సమావేశం అయ్యారు. "నేను సినిమా రంగానికి గుడ్‌బై కొడుతున్నాను. నాకు వివాహం నిశ్చయమైంది. వివాహం తరువాత చిత్రాల్లో పని చెయ్యను." అని చెప్పి, పత్రికల వాళ్లకు కృతజ్ఞతలను వెల్లడించింది.

ప్రమీలకు నవంబరులో వివాహం. ఇప్పుడామె నటిస్తున్న చిత్రాల షూటింగు పూర్తయ్యే ఘట్టాన్ని చేరుకొన్నాయి. "బాలనాగమ్మ, కాకతీయ మూవీస్, ఆస్తికోసం" చిత్రాలలో ప్రమీల వైవిధ్యం వున్న పాత్రలను పోషిస్తున్నది.

స్టార్‌డమ్ వుండికూడా, వేరొక కింగ్‌డమ్‌ను పవిత్రంగా పూజించదలచిన ప్రమీలను అభినందించాలి.

— శ్రీనివాస్

"బ్రతుకే ఒక పండుగ"లో ఒక దృశ్యం



# చుట్టాలొస్తారు! జాగ్రత్త!!

**వెంకట సుబ్బారావుకి ఉద్యోగం రావటం. వచ్చీరావటంతోనే, అతని** చెల్లెలు పెళ్లి చేయటం కోసం సుబ్బారావు అప్పుడే ''పెళ్లి వద్దు'' అని ఎంత మొత్తుకున్నా వినకుండ, కట్నం తీసుకుని సుబ్బారావుతో సుబ్బలక్ష్మి మెడలో మూడు ముడులు గట్టిగా వేయించి, ఆ కట్నంతో కూతురి వివాహం చేసి తాపీగా కూర్చున్నారు సుబ్బారావు తండ్రి

పెళ్లి అయిన మూడేళ్ళలోనే ముగ్గురు పిల్లలు వెంట వెంటనే పుట్టుకురావటం, కనీసపు సరదాలన్నా తీరకమునుపే భార్య సుబ్బలక్ష్మి ఆపసోపాలు పడుతూ, పురుళ్ళకోసం పుట్టింటికి మూడుసార్లు వెళ్ళి ఆరేసి నెలలు వుండి రావటం, సంసారంలో సుఖం, సంతోషం లోపించటంతో వెంకట సుబ్బారావుకి వెర్రీ ఎత్తి భార్యమీద విసుక్కోవటం, పిల్లలను కసురుకోవటం చేస్తూ వుండేవాడు అప్పుడప్పుడు.

తన తోటి వారందరూ యింకా పెళ్లిళ్ళు చేసుకోకుండ, హాయిగా జీవితం గడుపుతుంటే!! చూచి ఒక్కోసారి పిచ్చి ఎత్తినట్టు వుండేది పెళ్లి వద్దు! అని అన్నాడు కాని పెళ్లి అయిన తరువాత పిల్లలు పుట్టకుండ వుంటారా? ఇంత ఎడం లేకుండ పిల్లలు పుడతారని తెలిస్తే సుబ్బారావు చచ్చినా అప్పుడే పెళ్లికి అంగీకరించేవాడు కాదు.

తనూ భార్య కొన్నాళ్ళు హాయిగా, సినిమాలు, షికార్లు చేసి, లైఫుని ఎంజాయి చేద్దామనుకున్నాడు పెళ్లి అయిన కొత్తలో కాని సుబ్బలక్ష్మి వెంట వెంటనే ముగ్గురు పిల్లలకి తండ్రిని చేసేసరికి విసుగు పుట్టింది సుబ్బారావుకి

పాపం! చిన్న అద్దె కొంపలో పెద్దవాడికి, చిన్నవాడికి రెండు గుడ్డ ఉయ్యాలలు వేసి, ఆఫీసుకు వెళ్ళేవరకు వాళ్ళని సముదాయించి, భార్యకి ఇంటి పనులలో సహాయం చేసి ఆఫీసుకు వెళ్ళేవాడు.

ఆఫీసు వదిలిన తరువాత ఏ వ్యాపకాలు లేకుండ, అన్ని సరదాలకు కొన్నాళ్ళు వాయిదా వేసి, గబ గబా ఇల్లు చేరేవాడు. అప్పటివరకు పిల్లలతో సతమతమయ్యి, భర్త వచ్చిన తరువాత పనిలో లీనమై, పది గంటల రాత్రికిగాని బయటపడదు లక్ష్మి.

సుబ్బారావు భార్యని లక్ష్మి! అని పిలుస్తాడు. ఎవరైన పేరు అడిగితే అలానే చెప్పమని అంటాడు. సుబ్బలక్ష్మి, సుబ్బారావు అంటే! నవ్వుతారని అతని భయం.

మంచి సినిమా వచ్చిందని సుబ్బారావు భార్యతో సినిమాకి వెళ్ళాడు. చంటాడు దొడ్డికి వెళ్ళాడు. పెద్దాడు, చిన్నాడు కలిసి ఆ బొమ్మలు ఏమిటో అర్ధం కాక, విలయ విద్వాంసుల వాద్య బృందంలా ఒక్కమాటు ఏడుపు మొదలెట్టారు. ఎప్పుడు పిల్లలతో బయలుదేరకూడదని ఒట్టు పెట్టుకున్నాడు సుబ్బారావు.

ఒక్కడే వెడదామంటే!! మనస్సు అంగీకరించదు సుబ్బారావుకి పాపం! లక్ష్మి ఒక్కతే పిల్లలతో అవస్థ పడుతుంటే!! తను హాయిగా ఎలా చూడగలడు? భార్య, భర్తలు అన్న తరువాత కష్టమైనా, సుఖమైన కలిసి అనుభవించాలి అనే స్వభావం సుబ్బారావుది.

ఈ అవస్థలన్నీ పడలేక సుబ్బారావు మూడోవాడు పుట్టగానే, పిల్లలు పుట్టకుండ ఆపరేషన్ చేయించుకున్నాడు భార్య అమ్మాయి కోసం గోల పెట్టినా వినకుండ

పిల్లలు ముగ్గురు కొంచం పెద్దవాళ్ళయి, ఏడుపు మాని ఆడుకోవటం మొదలుపెట్టారు. లక్ష్మి కూడ కొంచం ఒళ్ళు చేసి అందంగా, ఆరోగ్యంగా తయారయ్యింది పెద్దవాణ్ణి, చిన్నవాణ్ణి నర్సరీలో చేర్పించి హాయిగా ఊపిరి పీల్చుకున్నాడు సుబ్బారావు.

పిల్లలు సినిమాకి వెళ్ళినా, షాపింగ్‌కి వెళ్ళినా మారాం చెయ్యటం మానేశారు. అల్లరి చేస్తే! బజారు ఎప్పుడు తీసుకురానని గదిలో పెట్టి తాళం వేస్తానని, పిల్లలకు చెప్పి, మరీ బయలుదేరతాడు సుబ్బారావు. ఏదీ కావాలని అడగరు. అడిగితే నాన్న బజారు తీసుకువెళ్ళడని భయంతో, చక్కగా అన్నీ చూస్తూ నడుస్తారు పిల్లలు.

* * *

సుబ్బారావు ఇప్పుడు చాల ఆనందంగా వున్నాడు. ఎప్పుడు, ఈసురోమని వుండే పిల్లలు ఆరోగ్యంగా వున్నారు లక్ష్మి ఎప్పుడు జిడ్డోడుతూ, జాకెట్టు బటన్సు వూడిపోయి, అడుగులంగా కనపడేట్లు చీర జారినా పట్టించుకోకుండ, జడ అల్లుకుంటానికి కూడ తీరక వుండేది.

ఇప్పుడు బజారులో ఏ ఫ్యాషన్ వస్తే అది తనే మొదలుపెడుతోంది. కొన్నాళ్ళకి ప్రమోషన్ మీద విజయవాడ ట్రాన్సుర్ అయ్యింది వెంకట సుబ్బారావుకి

విజయవాడలో అందమైన మంచి ఇల్లు తీసుకున్నాడు పిల్లల్ని కాన్వెంటులో చేర్పించాడు ఆనందంగా పదిహేను రోజులు గడిచాయి.



సుబ్బారావుకి బాధలు మొదలయ్యాయి బాధలంటే!! ఆర్థికంగా, మరే విధంగానూ కాదు సంసారం ఒడుదుడుకులు లేకుండ హాయిగా, సాగించే సంపాదనే సుబ్బారావుది కాని ఇవో రకమైన ఇబ్బందులు

సుబ్బారావు ఇల్లు మంచి సెంటరులో వుండటం చూచి, బంధువులు రాబందులులాగ పీక్కుతింటున్నారు ఏ పని మీదన్నా విజయవాడ వచ్చినవారు ఆ పని ఎన్ని రోజులకైనా పూర్తి అవనీ, అన్నిరోజులు సుబ్బారావు ఇంట్లో తిష్ఠవేసి, సుష్టుగా తిని, లేనిపోని ఆప్యాయతలు ఒలకబోసి వెళ్ళేవారు.

రాను రాను ఈ బంధువులు ఉదయం, రాత్రి, మధ్యాహ్నం, అర్ధరాత్రి అనక, ఒకరు విడిచి మరొకరు హాజరు వేసేవారు రాత్రనక, పగలనక వచ్చే

# చుట్టాలొస్తారు జాగ్రత్త!

చుట్టాల ట్రాఫిక్‌కి తట్టుకోలేక పోయేవాడు సుబ్బారావు.

నెల రోజులకు సరిపడ తెచ్చిన సామానులు పదిహేను రోజులకే అయిపోయేవి ధరలు ఆకాశాన, చంద్రమండల యాత్ర చేసే ఈ రోజుల్లో, ఒకటి, రెండు రోజులు వుండిపోవటం సహజం కాని ఇలా సంపాదించే రోజులలో జీతం హరించుకుపోతుంటే! వెనక ఆస్తిలేని సుబ్బారావుకి ఏమి చెయ్యాలో తోచక, సాంప్రదాయం, సంఘ కట్టుబాట్లకి లొంగి మారు మాట్లాడక వచ్చినవారికి మర్యాదలు చేస్తున్నాడు

పిల్లల చదువులకు, వారి అవసరాలకు నెల నెలా బ్యాంకులో కొంచం డబ్బు వేసేవాడు అదికూడ మిగలక, నెల ఆఖరుకి జీతం కోసం ఎదురుచూడాల్సి వచ్చేసరికి గుండె ఆగినంత పని అయ్యేది సుబ్బారావుకి అర్ధరాత్రి సెకండు 'షో'లు చూచి దిగే బంధువుకి, వేళ కాని వేళలో వచ్చినా, విసుక్కోకుండ వంట చేసి పెట్టేది లక్ష్మి

విజయవాడ వచ్చిన తరువాత భార్యతో కులాసాగా గడిపిన రోజులు వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు సుబ్బారావు పిల్లలు చదువులకి ఎదుగుతున్నారు సంపాదించే రోజులలో పైసలు దాచుకోక, తరువాత అవస్థలు పడటం, చేతులు కాలిన తరువాత ఆకులు గుర్తుకు వచ్చినట్లు అవుతుందని అనుకునేవాడు సుబ్బారావు

ఒక రోజు సినిమాకి బయలుదేరాడు సుబ్బారావు వీధిలోకి వచ్చేసరికి, సుబ్బారావు మేనమామ భార్య పిల్లలతో సహా ప్రత్యక్ష మయ్యింది

ఎండలో చెప్పలు లేకుండ నడిచి వచ్చినవాడికి మండిపోయినట్లు మండిపోయింది సుబ్బారావుకి కాస్త ఈ పూట ఎవరూ లేరు అలా సినిమాకి వెడదామంటే!! వీళ్ళు వచ్చారు

పెట్టెలు, సరంజామా అది చూచేసరికి అప్పుడే కదిలేట్టు లేదురా భగవంతుడా! అనుకుని కుర్చీలో కూలబడ్డాడు మర్యాదకోసం ఆ వచ్చిన వాళ్ళని లేని నవ్వు తెచ్చుకుని పలకరించాడు ఇల్లు మారటం అంటే! ఇంత మంచి యిల్లు దొరకటం భగీరథ ప్రయత్నం అవుతుంది బదిలీ చేయించుకోవాలంటే! మొన్ననే తన్ను ట్రాన్ఫర్ చేసింది ఆలోచిస్తూ కూర్చున్నాడు సుబ్బారావు లక్ష్మి వంటపని, ఇంటి పనిలో మునిగిపోయింది

వారం రోజులు గడిచాయి ఇంకా ఆవిడ కదలకపోవటం చూచి, జీతం వచ్చేలోగా ఎంత బ్యాంకు నుండి తేవాలి? అని ఎంతమందికి? ఎన్నాళ్ళు? అనే ఆలోచనలో పడ్డాడు సుబ్బారావు కనీసం పనిమనిషిని కూడ పెట్టుకోకుండ, ఉన్నదాంట్లో పొదుపు చేసుకుని, పిల్లల భవిష్యత్తు బంగారు బాట చేదామని లక్ష్మి, తను కష్టపడి, కూడపెట్టినది యిలా అన్నదానం చెయ్యటానికా? అని, బంధువులు తన చిన్నతనంలో, నాన్న కష్టాలు పడి, తనని చదివించి, అష్టకష్టాలు పడిన రోజులలో గుర్తులేని మేము, కాస్త బాగుపడేసరికి మళ్ళీ తయారయ్యారు అని అనుకుని ఆలోచనలకి ఫుల్‌స్టాపు పెట్టి లేచాడు సుబ్బారావు.

ఆ మర్నాడు ఉదయం రెండు సీసాల పాలు ఖాళీ చేసి, పిల్లలందరికీ పాలు పట్టి, తను వంట ఇంట్లో పెద్ద గ్లాసుతో కాఫీ తీసుకుని పట్టిస్తోంది, ఆ వచ్చిన ఆవిడ

పనిలో సహాయం చేయకపోగా, అవి చెయ్యి, ఇవి చెయ్యి అని, మా పిల్లలు ఇలా అవుతేనే తింటారు అని పురమాయించి, లేని డాబులన్నీ చెప్పి ఏది కావాలన్నా, అందించుకుంటూ పీట మీద కూర్చుంది

ఇంతలో ఒకతను వచ్చి తెల్ల కాగితం యిచ్చి వెళ్ళాడు కుర్చీలో కూర్చుని పేపరు చదువుకుంటున్న సుబ్బారావుకి లక్ష్మిని ఇవతలకి పిలిచి విషయం



''జేబుదొంగ''లో శోభన్, మంజుల

# డాక్టర్ సలహాలు

ఎస్. ఆర్. — సికింద్రాబాద్

నాకు 26 సం.లు. ముగ్గురు పిల్లలు, నాకు 2 సం.ల వయస్సులో వుండగా ఆయాసము వచ్చినది. చాలా మందులు వాడాము. ఇట్లా 2, 3 నెలల కొకసారి వస్తుంది. దీని నివారణోపాయము ఏమిటి?

★ చిన్న వయస్సునుండి 'ఆయాసం' రావటానికి ''అలర్జీ'' అనేదే ముఖ్య కారణమని చెప్పాలి. అలర్జీ అంటే ఏదైనా ఆహార పదార్థంగాని, గాలి మార్పుగాని, కొన్ని రకాల సువాసనలు — మందులు మొదలయిన వాటివల్ల, దుమ్ము—ధూళివలన ఏర్పడే శరీరంలోని మార్పులనే అర్థం

ప్రస్తుతం కొన్ని ముఖ్య కేంద్రాలు — అంటే జంట నగరాలలో తప్పకుండా — ''అలర్జీ క్లినిక్''లు ఉంటాయి. వారి సహాయంతో మీకు వేటివల్ల ఈ ఆయాసం వస్తున్నదో కనుగొని, దానిని ఉపయోగించి, ''డీసెన్సిటైజేషన్'' చేస్తే ఫలితం ఉండవచ్చును ఈలోగా తాత్కాలిక ఉపశమనానికి — మీరు వాడిన మందులే తప్ప — క్రొత్తగా, మేలైనవిగా ఏవీ లేవు.

యం వి ఎస్. కె. — చిత్తూరు

మా బాబాయి కుమారుని వయస్సు 6 నెలలు పిల్లవానికి ఒక పక్క వరిబీజము పెద్దదిగా వున్నది. ఇది పుట్టుకలో లేదు 5 నెలలు దాటిన తరువాత పెద్దదిగా కనిపించుచున్నది మూత్రము విసర్జించునపుడు ఏడుస్తాడు డాక్టరుకు చూపించగా ఆపరేషన్ అవసరమని చెప్పారు. ఏమి చేయమంటారు ?

★ పుట్టుకతోనే కొన్ని సమయాలలో కంటికి పెద్దదిగా అనవంత ప్రమాణంలో ఈ బీజం పెద్దదిగా ఉండటం కొంతవరకూ సహజమే! కొంతవరకూ, శాస్త్రరీత్యా, ఇది చాలా సహజమనే చెప్పాలి. ఎందుకంటే, శిశువు తల్లి గర్భంలో ఉన్నప్పుడు, ఈ బీజాలు శిశువు కడుపులో ఉండటం, 7వ నెల మొదలుగా, క్రమంగా వాటి ప్రకృతిసిద్ధ ప్రదేశానికి రావటం జరుగుతుంది. ఆ సమయంలో, అది పయనించే కాలువలు మూతబడకపోతే కడుపు భాగంలోని కొన్ని ద్రవాలు ఈ సంచీలోకి ఆ కాల్వల ద్వారా ప్రవహించడం, తర్వాత పడుకొన్నప్పుడు ఈ ద్రవాలు తగ్గిపోవటం, మరలా లేవంగానే రావటం జరుగుతుంది. శస్త్ర చికిత్స మాత్రమే దీనికి తగిన చికిత్స.

జె. ఎస్. ఆర్. — మచిలీపట్నం

మా బాబుకు నాలుగవ సంవత్సరము. ఇంతవరకు అమ్మ, నాన్న, తాత అనే మూడు మాటలే చెప్పగలడు. ఇంకేం మాట్లాడలేదు. సరస్వతి ఆకు తినిపించినాము. అయినా మాటలు రావటంలేదు.

★ 4 సం.ల వరకూ 3 మాటలు మాత్రమే వచ్చి ఉండటం అరుదు. ఈ విధమైన రోగాలు (ఉచ్చారణకు సంబంధించినవి) ఆకులతోగాని, లేక మంత్ర తంత్రాలతోగాని తగ్గవు.

స్పీచ్ థెరపిస్టు లనబడే ప్రత్యేక వైద్యుల (లేక వైద్యేతర నిపుణుల) సహాయం వల్ల క్రమంగా మాటలు వచ్చే అవకాశం ఉన్నది.

ఇలా రావటానికి మూల కారణం కనుగోవటానికి కొందరు నిపుణులైన ''న్యూరో ఫిజీషియన్లు'' పరిశోధించవలసి ఉంటుంది.

ఒకవైపు మూల కారణానికి మందు వాడుతూ, ఇంకోవైపు నోటికి సంబంధించిన కండరాల పెరుగుదల కలయికకి సమన్వయము కొరకు స్పీచ్ థెరపిస్టుల ద్వారా ఎక్సర్‌సైజ్ చాలా అవసరం.

ఎమ్ బి. వి ఎస్ — రాజమండ్రి

తెల్లబొల్లి మచ్చ ఎందువల్ల వస్తుంది? ఇది పూర్తిగా పోటానికి మీ సలహా ఏమిటి?

★ తెల్ల ''బొల్లి'' రావటానికి ప్రత్యేకంగా నిర్ణీతమయిన కారణమంటూ ఏదీ కనుగొనబడలేదు. కొన్ని కారణాలను, కొందరు — చాలా మందికి వర్తిస్తాయని చెప్పటం మాత్రమే జరుగుతున్నది.

ఈ మచ్చలకు, ఆయుర్వేదంలో కొన్ని మందులు ఉన్నట్లు, అవి బాగా పనిచేయగలవని మాత్రం తెలియవస్తున్నది

ఏదో పెద్దపెట్టున మార్పు వస్తుందని ఆశించడంవల్ల చివరికి నిరుత్సాహం కలిగినా ఆశ్చర్యం లేదు! కాని, చిన్నవిగా, చాలా కొద్దిచోట్ల మాత్రమే ఉన్న మచ్చలు ఎక్కువగా తగ్గిపోయినట్లు తెలియవస్తున్నది. మీరు నిపుణులైన ఆయుర్వేద వైద్యుల సలహా పొందటం మంచిది.

ఎమ్. ఎస్ — సికింద్రాబాద్

మా అక్కయ్యకు 18 సం.లు. 2 సం.ల నుండి బలపములు, విభూతి మొదలయినవి తినటం అలవాటయింది. ఇది ఆరోగ్యానికి మంచిదా? చెడా?

★ ''పెర్వెర్టెడ్ అప్పెటైట్'' అనే ఆహార విధానాలలో కలిగే వ్యక్తిగత అసహజత్వాలు, కొందరికి వయస్సు మీరిన తర్వాత రాగలిగినా, ఎక్కువగా ఈ రోగం చిన్న పిల్లలలో కనిపిస్తుంది

గర్భిణీ స్త్రీలకు ఈ రకం అలవాటు 'చాలా సహజం. కాని, మామూలు వ్యక్తులలో అంటే యుక్త వయస్కులలో ఈ అలవాటు చాలా అసాధారణం. ఈ అలవాటు వీరిలో ఎక్కువ కాలంగా ఉండటం వీరిలోని మానసిక, ప్రవృత్తిని మాత్రమే తెలియజేస్తుంది. మానసికంగా, కొన్ని విధాల అనుభూతులు, కోరికలు తీరనప్పుడు ఈ విధంగా జరిగే అవకాశం ఉన్నది ఆరోగ్యం పాడవటం అనేది, తిన్న పదార్థాన్ని బట్టి, తినబడిన సంఖ్యను బట్టి ఉంటుంది. మట్టి మొదలయిన వాటివల్ల దేహానికి చాలా హాని కలుగుతుంది

— డా॥ కె వెంకటేశ్వరరావు

## చుట్టాలు......

చెప్పేసరికి, కంగారు పడుతున్న లక్ష్మిని చూచి ఏమిటమ్మా? అని యువతల గదిలోకి భారీ శరీరాన్ని చేరవేసిందావిడ గాభరాగా.

మా అమ్మ అనుకోకుండ స్పృహ లేకుండ పడిపోయిందట నన్ను కలవరిస్తోందిట. వెంటనే రమ్మని టెలిగ్రాం వచ్చిందని, చెప్పింది లక్ష్మి కళ్ళు తుడుచుకుంటూ

ప్రయాణమయ్యే లక్ష్మిని చూచి, నేనుకూడ యిప్పుడే బయలుదేరుతున్నాను. మా ఊరికి గంటలో రైలు వుంది అని సుబ్బారావుతో చెప్పి, పిల్లల్ని తీసుకు ప్రయాణమయ్యింది. ఇంగ్లీషులో ఏదో వ్రాసి వున్న కాగితం చూచి, నిజంగా టెలిగ్రాం అని నమ్మిన ఆవిడ వెళ్ళిపోయింది

మనస్సులో దేవునికి నమస్కారం చేసి, కంగారు పడే భార్యను పిలిచి నవ్వుతూ అంతా చెప్పాడు. తెల్లబోయి విని ఆశ్చర్యపోయింది లక్ష్మి.

అప్పటి నుండి సుబ్బారావుకి చుట్టాలొస్తున్నారంటే!! భయం. వీధి గుమ్మానికి ఒక తాళం వేసి వుంచాడు. ఇంట్లో మనుష్యులు వున్నా, తాళం తగిలించి వుండటం చూచి వచ్చినవారు లేరని వెళ్ళిపోయేవారు.

ప్రక్కవారిని ఎవరైన అడిగినా మాకు తెలీదు అని అనేవారు ఎవరైనా వచ్చినా తాళం స్వాగతం పలికేది.వచ్చినవారు గేటుదగ్గరనుండి వెనుతిరిగేవారు.

ప్రతిరోజు ఆఫీసుకు వెళ్ళేముందు సుబ్బారావు భార్యకి చుట్టాలొస్తారు జాగ్రత్త అని చెప్పి వెళ్ళేవాడు.



*బాలల చిత్ర కళా ప్రదర్శనం*

నవరంగ్ చిత్ర కళా నికేతన్‌వారు జూన్‌లో 5వ అఖిల భారత బాలల చిత్ర కళ, ద్వితీయ ఔత్సాహిక చిత్ర కళా ప్రదర్శనను నిర్వహించారు. ఈ ప్రదర్శనకు శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయం భౌతిక శాస్త్రాచార్యులైన డాక్టర్ కె. శ్రీరామమూర్తి ప్రారంభోత్సవం చేశారు. రాష్ట్రపతి బహుమతి గ్రహీత శ్రీ మద్దులూరి రామకృష్ణ అధ్యక్షత వహించారు. గెలుపొందిన బాల బాలికలకు డాక్టర్ కొత్త రవీంద్రబాబు బహుమతి ప్రదానం చేశారు. శ్రీ సి పాండురంగారావు ప్రదర్శన సంచికని ఆవిష్కరించారు.

శ్రీ బోయపాటి రంగయ్య స్వర్ణ పతకం బరోడాకు చెందిన 15 సంవత్సరాల బాలిక కుమారి మొనాల్ ఎన్. పటేల్ వేసిన ''పల్లె పడుచు'' చిత్రానికి లభించింది.

నింకా చీకటి పొరలు విడలేదు. ఆకాశం తెల్లబారటానికింకా కొంత వ్యవధి వుంది. అక్కడో కాకి 'కావ్, కావ్'అంటూనో ఇక్కడో కోడి 'కొక్కొరోకో' అంటూనో ఆ నిశ్శబ్ద గంభీర సమయాన్ని భగ్నపరుస్తున్నాయి.

"పెద్దమ్మగోరో...దూడని ఋడిచినా... పాలచెంబియ్యండి." పాలేరు నరసన్న పెరట్లోంచి గావుకేక పెట్టాడు.

మధ్య సావిట్లో నులకమంచంమీద మగత నిద్రోతున్న రంగమ్మకి ఆ కేకతో తట్టి లేపినట్టుగా మెలకువ వచ్చింది.

బద్ధకంగా ఓ పక్కనించి మరో పక్కకి మసిలింది.

"అమ్మగోరో!" నరసన్న మరోకేక.

భారంగా కళ్లు విప్పి నెంపాదిగా లేవబోయింది రంగమ్మ. కానీ శక్తి ఉడిగిన కీళ్లు మూలుగుతూ కదలమని మొరాయించటంతో ఆమె ప్రయత్నం కొనసాగలేదు.

"పెద్దమ్మగోరూ... మిమ్మల్నేనుండీ ... పలకరేముండీ ..." అసహనంగా కేకమీద కేకగా అరుస్తున్నాడు నరసన్న పెద్ద గొంతుకతో.

క్రిందటి రోజు పాపుబస్తా అటుకులు దంపింది రంగమ్మ. చేతుల్లో సత్తువ చచ్చిపోయినా కోడలి మూతి విరుపులకి వెరిచి, కాకిమీదా, పిల్లిమీదా పెట్టి ఆవిడనే దెప్పిపొడుపు మాటలకి అభిమానపడి పళ్ల బిగువున పోటువేసింది. అలివి మాలిన చాకిరీ చేసినందుకు ఫలితం తెల్లవారే సరికి వంటిమీద కనిపిస్తోంది. అరవై ఏళ్ల జరాభారంతో స్థితిస్థాపకత్వం సడలిన కండరాలు పులిసిపోయాయి. నరాలు నీరసించాయి. శరీరంలో వున్న కీళ్ళన్నీ, "అరవై ఏళ్లు నీ మాట విన్నాం. ఇక వినం." అని ఘొరావో చేస్తున్నాయి.

'ఉహూ. వాటిమొర ఆలకిస్తే ఎలా? ఊపిరున్నంతవరకో... పూర్తిగా మూలపడేదాకానో తనకీ శ్రమ తప్పనిసరి.' లేని ఓపిక కూడదీసుకుని చేతులొత్తి మంచం పట్టీలు అదిమిపట్టి లేచి నుంచుంది రంగమ్మ.

గోడ ఆసరాగా అడుగులో అడుగు వేసుకుంటూ, తూలుతో వెళ్లి తలుపు తీసి నరసన్నకి పాలు తీసేటందుకు కంచు చెంబందించింది.

"ఏందమ్మా... ఈ దినం ఇంకా బబ్బునే వున్నావ్;పాచి వాకిలన్నా ఊడిచినట్టు లేదే?" నరసన్న రంగమ్మకేసి ఒక చూపు విసిరి, జవాబుకోసం ఎదురుచూడకుండానే చెంబందుకుని గేదె దగ్గరికి పరిగెత్తాడు హడావిడిగా. "ఇప్పటికే దూడ ఎన్నిపాలు కుడిచేసిందో ఏమో..." అనుకుంటూ.

నరసమ్మ అన్నది నిజమే. ప్రతి రోజూ తొలికోడి కూయకముందే లేచి, ఇల్లూ వాకిలీ చిమ్మి, నీళ్లకి పొయ్యా, పాలకి దాలీ రాజేసి, నరసన్న రాకకోసం ఎదురుచూస్తూ వుంటుంది రంగమ్మ ఈ వేళకి.

సూరీడన్నా ఉదయించడానికి జాప్యం చెయ్యొచ్చునేమోకానీ ఈ దినసరి కార్యక్రమానికి తాత్సారం జరగటానికి వీల్లేదు. అలా ఆలస్యం అయిననాడు కోడలు లక్ష్మీకాంత లేస్తూనే శివతాండవ నృత్యం చేస్తుందని రంగమ్మకి బాగా తెలుసు.




రంగమ్మ భయపడుతున్నటు గానే అన్ని పనులూ తెమలకమునుపే తెల్లవారిపోయింది. లక్ష్మీకాంత లేవనే లేచింది.

తేస్తూనే ఏడపిల్లాడు బాకా ఏత్తేసరికి పాలకోసం దొడిదగ్గరకు వెళ్లింది. మీగడ తరకన్నా కట్టని పాలు దానిమీద తెల్లబోతూ కనిపించాయి. అగ్రహారం ముంచెత్తటంతో చుట్టూరా చూసింది. నమిలి మింగాలనుకున్న

## లో కం పో క డ

అత్తగారు దరిదాపుల్లో కనిపించలేదు. ఇక ఎవరిమీద కక్కాలో తెలియని కోపాన్ని ఏడుస్తున్న కుర్రవాడి వీపుమీద చూపించటంతో వాడి రాగం తారస్థాయి నందుకుంది. రుసరుసలాడుతూ వాడి నక్కడ కుదేసి, పక్కవూళ్లో హైస్కూలు చదువుకోసం వెళ్లాలిసిన పెద్ద పిల్లాడు స్నానానికి తొందర పడుతోంటే నీళ్లపొయ్యికేసి నడిచింది.

కాగులో చెంబుపెట్టి నీళ్లు తొరప బోయే సరికి చలన్నా విరగని నీళ్లు వెక్కిరించి నవ్వాయి.

నిప్పు తొక్కిన కోతిపలె అయింది లక్ష్మీకాంత. ఆమె నోటికి దురుసు హెచ్చు. విసిరే వాక్బాణాల ములుకులు మహవాడి. దూసే మాటల బాకులు చాలా పదును. అవి ఎవరిని ఎక్కడ బాధించాలో వారికే సూటిగా ఘాటుగా తగిలి నొప్పించగలవు.

వంగిపోతున్న నడుముతో మంచినీళ్ల బిందెత్తుకు వస్తున్న అత్తని చూస్తూనే గాలిదుమారంలా రేగింది లక్ష్మీకాంత.

''తేరగా తినటానికయితే మందిజనం ఇంటినిండా ఉన్నారుగానీ, కాస్త పాలూ నీళ్లూ వెచ్చబెట్టి ఇచ్చే దిక్కుమటుకూ లేదు ఈ కొంపలో.'' లక్ష్మీకాంత కంచు కంఠం ఖంగున మోగింది.

కోడలి కఠిన స్వభావం ఎరిగినదే అయినా ఎప్పటికప్పుడు ఈ విసుర్లకి రంగమ్మ గుండె గాయపడుతోనే వుంటుంది.

'తనూ తన భర్తా సుఖంమాట తల పెట్టక, వయసులో వుండే కోరికల వూసెత్తక కూడబెట్టి కట్టుకున్న ఇల్లిది.

ముతక చీరలు కట్టి, నూకల కూడు తిని, డాబుసర్లకీ దర్జాలకూ పోక రాబడికి తగ్గట్టయినా ఖర్చుపెట్టక, కానికి కానీ వెనకేసి పెంచిన ఆస్తి ఇది.

తన కష్టఫలితాన్ని జుర్రుకుంటూ హంగు చేస్తున్న కోడలు ఈనాడు తననీ యింటికి పరాయిదాన్ని చేస్తోంది తేరతిండి తింటున్నా వంటోంది. రంగమ్మ మనస్సు చివుక్కు మంటోంది.

''అల్లా ఆ జగన్నాథం గారింట్లో వెంకా యమ్మ నయం-అగ్గగ్గలాడుతూ తెల్లవారే సరికి కాఫీ టిఫెన్లు సయితం అమర్చి వుంచు తుందిట. లక్ష్మీకాంత విసిరిన మరొక ఈటె. కోపం వచ్చినప్పుడు లక్ష్మీకాంత నోటివెంట వెలువడే పలుకులు విషం పూసిన ఛురికలే.

'వెంకాయమ్మ ఒక వంటమనిషి. ఆవిడకీ తనకీ సాపత్యం కడుతోంది లక్ష్మీకాంత. అదీ కోడలి దృష్టిలో అత్తకున్న విలువ. నీళ్ల బిందె తిన్నెమీద దింపి నీళ్లపొయ్యి విసిరేటం ముకు వెడుతూ వెలితిగా నవ్వుకున్నది రంగమ్మ

నిజమాలోచిస్తే రంగమ్మ అనుభవిస్తోన్న ఈ బానిసపు బ్రతుకు కంటే వెంకాయమ్మ జీవితమే ఎంతో మెరుగు.

వప్పుకున్న వంటపని మాత్రమే ఖచ్చితంగా చేసిపెట్టి నెలయ్యేసరికి ఏభయి రూపాయలు ఠంగున చేతిలో వేయించుకుం టుంది. ఏడాదికి నాలుగు చీరెలు నిలదీసి కొనిపించుకుంటుంది. పొరపాటుగా నయినా మాట తూలారంటే వాళ్ల అటు ఏడు తరాలూ ఇటు ఏడుతరాలూ తరించిపొయ్యేలా దుయ్యబట్టి, పరువు బజారుకీడ్చి ఆ ఇంటికి రాంరాం చెబుతుంది.

ఇంటి మనిషన్న మాటేగానీ రంగమ్మ కేదీ ఆ స్వేచ్ఛ ? రాత్రి నిద్రించే ఆ నాలుగు ఘడియలూ తప్పించి పగలంతా వేళాపాళా అనకుండా వంట దగ్గర్నించి పసివాడి పొత్తి గుడ్డలు శుభ్రం చేయటం వరకూ ఆపనీ ఈ పనీ అనే విచక్షతలేకుండా రెక్కలు విరుచుకొని పాటుపడుతుంది, వంటిమీదో బట్ట—బండ మీదో బట్టగా ఇబ్బంది పడుతో వాడుకుం టుందే తప్ప మూడో బట్టకోసం నోరెత్తి అడగదు.

కోడలు తూష్కరించినా, కొడుకు మంద లించినా, మనుమలు సయితం నిర్లక్ష్యంచేసి దులపరించినా నా వారేకదా నన్నన్నదని సరి పెట్టుకుంటుంది గానీ ఎదురు తిరిగి మాటకు మాట అప్పగించదు. సాధించినా, వేధించినా నా రక్తంలోరక్తం కదా వీళ్ళని అభిమానంగా కడుపులో దాచుకుని భూదేవిలా ఓర్పు కుం టుందే తప్ప పెదవి విప్పి పరులతో చెప్పు కోదు.

ఈ విషయాలన్నీ లక్ష్మీకాంతకు తెలియనివా ?

రంగమ్మ సహజంగా మేథకురాలు. బహుశా ఆ మెతకదనం చేతనే కోడలికి లోకువ అయిందేమో! ఆ లొంగుబాటు ధోరణి మూలాన్నే ఆ ఇంట ఆమెకు గౌరవం లేక పోతోందేమో!

లోలోపల బాధపడుతూ పని తప్ప పలు కెరుగని యంత్రంలా తలెత్తకుండా తన పని తాను చేసుకు పోతోంది రంగమ్మ. కానీ బల హీనతతో మనశ్శరీరాలు రెండూ అనారో గ్యంగా వున్న ఆ దుర్బరస్థితిలో రంగమ్మకి ప్రతిపనీ తడుముళ్ళాటగా వుండి కొంత తడవవుతోంది.

పైగా పొయ్యికూడా సరిగ్గా మండక అవస్థ పెడుతోంది. ఇంట్లో స్టౌవ్వూ, కుంపటీ వున్నాయి గానీ అవి లక్ష్మీకాంత మధ్యాహ్నం పూటలు తేలిగ్గా కాఫీ కాచుకుందుకో, నా జూగ్గా వుప్మా చేసుకుందుకో మాత్రమే పరి మితం. రంగమ్మ వంటకి ఎండీ ఎండని తాటి కమ్మలూ కొబ్బరి మట్టలే ప్రాప్తి, ఊదుతూ విసురుతూ వాటితో నానా తిప్పలూ పడుతూ వుండగానే కొడుకు శేషయ్య వచ్చారు. రాత్రి పొలంలో కుప్పదగ్గర కాపలా పడుకుని అప్పుడే ఇంటికి చేరాడతను.

వంటింటి ముందుకు వస్తూ,''అమ్మా కాఫీ ఇస్తావా!'' అని అడిగాడు శేషయ్య.

పల్లెటూరిలో పుట్టి పెరుగుతున్నా పట్న వాసం అలవాట్లు కొన్ని జీర్ణించుకు పోతాయి కొంతమందికి. వాటిల్లో కాఫీ అలవాటొకటి. ప్రొద్దుటే కాఫీ పడకపోతే నిలవలేడు శేషయ్య.

''ఇంకా డికాక్షను కాగలేదు నాయనా! కొంత సేపు తాళు.'' పొయ్యి వూదుతూ మెల్లగా జవాబిచ్చింది రంగమ్మ

''ఎనిమిదవుతోంది. ఇంకా కాఫీ అన్నా కాచలేదా? '' నుదురు చిట్లించాడు శేషయ్య.

ఇంకాశాంతించలేదు లక్ష్మీకాంత. ''మామ పొద్దెక్కేవరకూ మన ఇంట తెల్లవారదయ్యే! మరి కాఫీ తయారయ్యేసరికి సూర్యుడు నడి నెత్తి కెక్కినా, భోజనాలయ్యే వేళకి పొద్దు వాటారినా, ఆశ్చర్య పోనక్కరలేదు.'' సావకా శంగా చంటివాణ్ణి అడ్డం వేసుకుని పాలిస్తూ భర్తకు వ్యంగ్యంగా సమాధానమిచ్చింది లక్ష్మీకాంత

ఆ అతిశయోక్తులు తనకే వర్తిస్తాయని లక్ష్మీకాంతకు మొట్టినట్టు చెప్పగలిగే ధీరు లింకా పుట్టలేదు

'నువ్వా అంతేగా !' అన్నట్టు భార్యకేసి ఎత్తిపొడుపుగా చూడబోయి, అంతలో ఆమె

## ఆత్మదీపం

నీలోను
నాలోను—
కరుడు గట్టిన
కాలకూట గరళాన్ని
తుదముట్టించి
మాలిన్యాన్ని కడిగి,
మమతను సృష్టించి,
మానవతను స్థాపించి,
కస్తూరి—చందన ముగ్గులు వేసి
ఆత్మ దీపం వెలిగిద్దాం!

—కె. బాలాజీ బాజీరావు

## లోకం పోకడ

చూపు తన చూపులో కలవడంతో కలవరపాటుగా దృష్టి తల్లివైపు మరల్చుకుని,

"అది పిల్లలతో తొందరగా లేవలేదని తెలుసు మరిదా...నువ్వయినాకొంచెం పెందలాడే లేవకూడదా అమ్మా!"అని విసుక్కున్నాడు శేషయ్య.

వంటిల్లంతా చుట్టేసిన పొగలో ఉక్కిరిబిక్కిరవుతున్న రంగమ్మకి కొడుకు విదిలింపు కొరడా ఝళిపించినట్టే అయింది.

వేదనతోనూ, వ్యధతోనూ ఆమె హృదయం భారమయింది. కళ్ళు చెమ్మగిల్లాయి. వాడి ముడుతలుపడిన చెక్కిళ్ళు ఆశ్రువులతో తడిసాయి. నిస్సహాయంగా కొంగుతో కళ్ళొత్తుకుంటూ పొయ్యిదగ్గిర కూలబడి అదేపనిగా విసరసాగింది రంగమ్మ.

* * *

ఆ మధ్యాహ్నమే విత్తనాలకోసం కూలీల చేత వేరుశెనక్కాయలు ఒలిపిస్తున్నాడు శేషయ్య. ఆ చావిట్లోనే ఒక పక్కగా పనికిరాని బట్టల మూటల్లే, ఒడిలిన ఆకుల పోగల్లే, ముసుగుదీసుకుని పడుకున్నది రంగమ్మ.

రోజల్లా గానుగ ఎద్దల్లే చాకిరీచేసే తల్లి అల్లా పనికి ఎగనామం పెట్టి పవ్వళించటం శేషయ్యకి మహా గుర్రుగా వున్నది.

వుండదూ మరి...! ఇప్పుడావిడ డ్యూటీ ఏవిటి ? ఆ కూలీలతో సమానంగా కూర్చుని కాయలు ఒలవాలి; వాళ్ళని మంచిమాటలాడుతో చక చక పనిసాగేలా చూడాలి; మాటల్లో పెట్టి మరి నాలుగ్గింజలు ఎక్కువ దిగజారేలా కొలవాలి ఈ పనులన్నీ ఎగ్గొట్టి తనక్కానట్టు బబ్బుంటే మండదూ...?

అదే టైముకి లక్ష్మీకాంత గూడా నుష్టుగా భోంచేసి పడగ్గదిలో బూరుగ దూది పరుపుమీద ఆపసోపాలు పడుతోవుంది' ఆ సంగతి గమనానికి లేదా శేషయ్యకి ? అంటే... వుంది... కానీ అతని యోచనా వైఖరి ఎటువంటిదంటే—

వెనకటికి ఒక బిచ్చగాడు, 'ఎప్పుడూ పెట్టని మహాలక్ష్మి ఈనాడూ పెట్టలేదు; సరే బాగానేవుంది. మరి రోజూపెట్టే దానికేమొచ్చిందో పెద్దరోగం ... ఈ రోజు పెట్టిందికాదు అనుకున్నాట్ట' అలాటిది.

'అది ఓనాడు శరీరాన్ని కనుగందనిచ్చింది గనుకనా ఈ వేళ ఒళ్ళు దాచుకుంటోంది అని వేలెత్తి చూపించడానికి. పులిని చూసి నక్క వాత పెట్టుకున్నట్టు, కోడల్ని చూసి ఉట్రవుడియంగా పుట్టుకొచ్చే ఈ ముసిల్దాని తెగులుకి అనుకోవాలి గాని.' లోలోపలే గుంజుకున్నాడు.

తెచ్చిపెట్టుకున్న ఆ ఓర్పూ ఆట్టేసేపు నిలవలేదు శేషయ్యకి. "ఏమే అమ్మా! ఉత్తినే అట్లా పడుక్కోకపోతే లేచి నాలుగ్గింజలు ఒలవరాదూ ?" అన్నాడు లబ్జుగా.

అతనికి తల్లి నిద్ర నటిస్తోందనే అనుమానం. నూటికో కోటికో రంగమ్మ ఒక్కొక్కసారి అలక సాగించి ఈ విధంగా తన కోపాన్ని పకటితం చేస్తూండటం కద్దు. పేదవాడి కోపం లాంటిది ఆ అలక. దాన్ని ఎవరూ లక్ష్యపెట్టరు. చివరాకరికి కొడుకు, 'ఇన్నేళ్ళొచ్చాయ్. నీకీ పిల్లంతనపు చేష్టలేమిటి ? ఈ ముసుగు తన్నటంలాంటి పోకిళ్ళేమిటి ? ఎవరయినా చూస్తే నవ్విపోగలరు 'చాల్చాల్లే గాని ఈపాటికి లే లేచి పని చూసుకో.' అని నాలుగు చివాట్లు పెట్టి కసరటంతో అంతమవుతూ వుంటుంది.

దానితో ఇంకా 'కొడుకు వస్తాడు. వచ్చి బ్రతిమాలుతాడు;' అని ఆశగా ముసుగు బిడాయింపులోని ఉడకపోతలో క్షణాలు లెక్కపెడుతోన్న రంగమ్మ ఒక్కసారిగా స్పృహ తెచ్చుకుంటుంది. తనకాయింట వున్న స్థానమేపాటిదో గ్రహింపుకొచ్చి నిర్వికారంగా నవ్వుకుంటూ తిరిగీ రొటీనులోకి జారిపోతూ వుంటుంది.

ఉదయంనించీ రంగమ్మ ఏవో పొరపాట్లు... ఆలస్యంగా నిద్రలేవటం దగ్గర్నించీ, డికాక్షన్ స్ట్రాంగుగా రేకపోవటం, కాఫీలో పంచదార ఎక్కువవడం, పప్పులో తాలింపు వేగకపోవటం వరకూ చిట్టీపొట్టీ పొరపాట్లు దొర్లిస్తూనే వుంది. పగవాళ్ళను సతాయించినట్లావిణి కొడుకూ కోడలూ గూటిస్తూనేవున్నారు.

అదే తల్లి సత్యాగ్రహానికి కారణమనుకున్నాడు శేషయ్య.

దాన్ని ఎగరగొట్టే చిట్కా తన నాలుక కొననే వుందయ్యే. ఇంకాలస్యమెందుకూ...?

"అందరి చేలలో విత్తులు చల్లివారమయింది. మన పనిమటుకు ఎక్కడున్నావే గొంగళీ అంటే వేసిన చోటే అన్నట్టు ఒలవటందగ్గరే నీలుగుతోంది.

ఏదీ - ఆ బెంగ నా ఒక్కడికే తప్ప ఇంటి మనుషుల్లో ఏ ఒక్కరికన్నా కాబట్టిందీ...!

తెలిసీ తెలియని పిన్నలకయితే ఓ దెబ్బవేసి దారికి మలుపుతాం... అన్నీ తెలిసి కావాలని మూడంకె వేసే పెద్దలకేమని బుద్ధులు చెబుతాం. ఏళ్లు రాగానే సరా...?" శ్రావణ మాసం వర్షం-జలు జల్లుకీ మధ్యవిరామంలా వాక్యానికీ వాక్యానికీ నడుమ అవుతూ, ఆపి తల్లికేసి ఫలితం కోసం చూస్తూసాగించాడు శేషయ్య తన ప్రయోగాన్ని.

సహజంగా చాలా అభిమానవంతురాలు రంగమ్మ. మామూల్మాలుగానయితే ఆమెకీ మోతాదు చాలు; ఇహ మాటాడకుండా లేచి పనిలో జొరబడి పోవడానికి. కానీ ఈ రోజు ఏమైందో ఇన్నిమాటలన్నా ఆమెలో ఏటువంటి చలనమూ కలుగలేదు.

శేషయ్య సహనం పూర్తిగా అడుగంటింది. ఇక ఉరుములూ మెరుపులతో జడివాన కురిపించడమే తరవాయి.

ఇంతలో అటుకగా రంగమ్మనే చూస్తూ వేరుశనక్కాయ వొలుస్తున్న ఒక కూలిమనిషికి సందేహమొచ్చి, "ఒదర మాకు బాబయ్యా. ఆయమ్మ ఏలకో ఒణుకుతుంది. దాపలకెళ్లి మీన సెయ్యేసి సూడు" అని సానుభూతితో సలహా యిచ్చింది.

వినంగానే నమ్మలేని విషయాలుంటాయి కొన్ని.

ఫారిన్‌లో తయారయిన వస్తువుకన్నా ఇండియా సరుకు మన్నిక ఎక్కువన్నా;

ప్రజలు అవిశ్వాసం ప్రకటించకుండానే తన అప్రయోజకత్వాన్ని అంగీకరించి పదవీ సింహాసనాన్నించి దిగిపోయే నిజాయితీ గల మంత్రివర్యుడన్నా;

అమెరికా పెట్టిన అప్పు నయాపైసల్తో సహా ఇండియా తీర్చేసిందన్నా...

నిన్న ఆకాశాని కెగిసిన ధరలు ఈవేళ నేలబారుకి పడిపోయాయన్నా ... గబుక్కున నమ్మలేం.

బాహాటంగా అనకపోయినా ఇలాంటి అసంభవమయిన విశేషాల్లో తన తల్లి అనారోగ్యానికి గురికావటమన్నది కూడా చేర్చవచ్చని శేషయ్య నమ్మకం.

సన్నగా రివటల్లే ఉన్నా రంగమ్మకి ఓరుపు గుణం మెండు. చిన్న చిన్న నలతలని సరుకు చెయ్యదు. లక్ష్మీకాంతలా గోరంతని కొండంత చేసి ఇస్సో-అస్సో అనదు. కనీసం ఒంట్లో బాగులేదని గూడా బయటపడదు. అదేపోతుంది లెమ్మని తోసుకు తిరుగుతుంది. చెప్పుకోదగ్గ పెద్ద సుస్తీలెప్పుడూ రాలేదు కూడా.

" నీ శరీరం ఫారిన్ మేడ్ అమ్మా " అంటుంటాడు శేషయ్య ఛలోక్తిగా. అలాటి శేషయ్య ఇప్పటివరకూ తిరుగుతోన్న తల్లికి అంతలో పడక పెట్టేటంతగా ముంచు కొచ్చిందంటే నమ్ముతాడా ?

అపనమ్మకంగా రంగమ్మ మొహంమీది ముసుగుతప్పించి మెడమీద చెయ్యి వెయ్య వెయ్యబోతూ స్తంభించిపోయాడు శేషయ్య.

రంగమ్మ మూతి వికారంగా ఓపక్కకి తోసుకుపోయింది విపరీతమైన ఉష్ణంతో ఒణుకుతోంది శరీరం. కూలిమనిషి సాయంతో మంచంమీదికి చేరుస్తోంటే ఆమె కుడిపార్శ్వం జీవంలేనట్టు వేలాడిపోయింది.

డాక్టరువచ్చి ఫీజు గుంజకుండానే రంగమ్మకువచ్చిన రోగమేమిటో తేల్చి చెప్పేసింది కూలిమనిషి. "పక్షవాతం! పెద్దతనాన వచ్చిన రోగమిది. ఇంకేం తగ్గద్దీ ... ఇక మంచాన ఉండాలిసిందే." అని.

* * *

రంగమ్మ పెద్దకొడుకు నాగయ్యకూడా అవూర్లోనే ఉంటున్నాడు.

తల్లి ఇలా మంచాన పడ్డసంగతి శేషయ్య అన్నగారికి కబురుచేశాడు. ఆదరా బాదరా పరిగెత్తుకువచ్చాడు నాగయ్య.

అప్పటికే సావిట్లో ఉన్న రంగమ్మని సామాన్ల గదిలోకి మార్చేశారు. నాగయ్య వస్తూనే తల్లిదగ్గరకు చేరిపోయాడు. తల్లి పడుకున్న నులక మంచంమీద కూర్చొని, 'అమ్మా! అంటూ ఆప్యాయతగా' ఆరాటంగా పలకరించాడు స్పృహలోనే వున్నది రంగమ్మ. కొడుకు హస్తాన్ని తన చేతిలోకి తీసుకుని కన్నీరు పెట్టుకుంది.

కన్నతల్లిని ఆ దీనస్థితిలో కాంచిన నాగయ్య కళ్లు కూడా ఆర్ద్రమయ్యాయి. తెలియకుండానే మనసు అవ్యక్తమైన వేదనా భూతికి లోనయి విలవిల్లాడింది.

ఆ గాఢమయిన వేదనోద్వేగం కొంత పలచబడిన పిదపగానీ తల్లి నెక్కడుంచారో గుర్తించలేదు నాగయ్య.

చెమ్మగిలి మసగబారిన కళ్లతో చుట్టూ చూశాడు.

విరిగిన చెక్కసామానూ, అరిగీ, చిల్లుబడీ, అక్కరమాలిన పాత సామానూ, పాత గోనె సంచులూ మొదలైన పారెయ్యలేనివీ పనికి రానివీ అయిన సామాన్లతో మూడువంతులు నిండిన ఆ గది వికలాంగుల శరణాలయంలా వున్నది.

వాడిక లేకపోవటం మూలాన్ని, శుభ్రం చెయ్యటంకూడా అరుదేమో ... ఇంతెత్తున దుమ్ము పేరుకుని ట్రంక్ రోడ్డు పక్క పశువుల శాలలా గలీజుగా వుంది.

స్తంభాలాట ఆడుకుంటున్న వీగో పిల్లల్లా ఎలుకలూ, చుంచులూ చిందులేస్తూ ఆ కలుగులోంచి ఈ కలుగులోకీ, ఈ కలుగులోంచి ఆ కలుగులోకీ పరిగెత్తుతున్నాయి.

కిటికీలు లేకపోవటం మూలాన్ని వెలుతురనే దేవత ఆ గదిమీద అలుకబూని రావటం మానుకున్నది.



వాయుదేవుడు భీకరాకారంతో ప్రళయ ఝ ఝూ మారుతాన్ని వీస్తూ లోకాన్ని వూపగలడేమో గానీ ఆ గది ఛాయల్లోకి మాత్రం రాలేదు.

ఆకారాలు గుర్తింపగలిగేటంత కాంతిని విడుస్తున్న బెడ్‌లైటు ఒకటి ఇంతోటి వైభవానికీ నేనుచాలనా అన్నట్టు ధీమాగా వెలుగుతోంది అక్కడ.



అటువంటి గదిలో కుక్కి మంచంమీద ముసలిదీ, రోగిష్టిదీ అయిన రంగమ్మ విరిగిన సామానుల్లో తనూ ఒక సామానులా రెక్కలు విరిగిన పక్షిలా దీనంగా పడివుంది.

ఉవ్వెత్తున పొంగుకొస్తున్న ఆక్రోశాన్ని ఆపుజేసుకుంటూ, ఇంతకంటే 'మంచిచోటు దొరకలేదు కాబోలు, అమ్మని పడుకోబెట్టడానికి!' అనుకున్నాడు నాగయ్య.

సహజంగా మెతకుడు అవటంనించి గద్దించి అడగలేక, "అమ్మని నడవాలోనే ఉంచితేనేం... ? ఇక్కడ గాలీ వెలుతురూ బొత్తిగా రాటంలేదు." అన్నాడు మెల్లగా తమ్ముడితో.

తికమక పడ్డాడు శేషయ్య. "అబ్బే ... ఇక్కడయితే అడ్డంలేకుండా వుంటుందని కొంత అంటేనూ..." అంటూ తడబడ్డాడు.

శుష్కహాసం చేశాడు నాగయ్య.

'మరే... అడ్డేమరి. పందిరి మంచం బాగున్నన్నినాళ్ళూ అందరమూఎక్కితొక్కాం. కోళ్ళు విరగంగానే సావిట్లో అడ్డుగావుందని కుసులూడదీసి కట్ట గట్టి ఈ గదిలోనే పారేశాం. నిజమే అమ్మ నిక్కడుంచటమే సమంజసమేమోలే...'

బావగారి సూచనకి లొంగిపోయి భర్త "సరే"నంటూ ఎక్కడ బుర్ర వూపేస్తాడో అని ఆత్రంగా అతనివంకే చూస్తున్న మరదల్ని గమనించాక అనాలని అనుకున్నవన్నీ పైకనలేక పోయాడు నాగయ్య. నిట్టూర్చి వూరుకున్నాడంతే.

తల్లి చేతిస్పర్శ వెచ్చగా తాకుతోంది వంటికి. "డాక్టరుగారికి కబురు పంపావా ?"! అన్నాడదుర్దాగా నాగయ్య.

"ఆc — ఆ. ఆచారిగారు వచ్చి చూసి వెళ్ళారిందాకనే." బుద్ధిమంతుళ్ళా సమాధానమిచ్చాడు శేషయ్య తల వూగిస్తూ.

ఆ వూళ్ళో ఆయుర్వేద వైద్యుడిగా చెలామణీ అవుతున్న మహానుభావుడు ఆచారిగారు. ఆయన ప్రొద్దుట లేస్తూనే కల్వంలో ఏహో నాలుగు దినుసులు వేసి నూరి మాత్రలు కట్టి పెట్టుకుంటాడు... ఏ ఏ దినుసులు వేస్తాడో ఆయనకీ ఆపైె వున్నవాడికీ తప్పించి మూడో వాడికి తెలియదు.

ఇక రోజంతా వచ్చే రోగులందరికీ ... వాళ్ళు ఎన్నెన్ని రకాల బాధలు వెళ్ళబోసుకోనీగాక ... అన్నింటికీ ఆ కల్వంలో మాత్రలే మందు; ఒక్కటే అనుపానం.

## నాస్తికమతాలు ఆస్తికమతాలు

ప్రపంచంలో ఎన్నో మతాలు ఉన్నవి. కొన్నిటికి దేవుడు ఉన్నాడనే నమ్మకం ఉంటుంది. కొన్నిటికి అట్టి నమ్మిక ఉండదు. భగవంతునిపై నమ్మకం ఉన్నా, లేకపోయినా— ఆయా మతప్రవక్తలు తమ తమ మార్గాలలో మానవాభ్యున్నతి కొరకే పాటుపడ్డారు. ప్రచారాలు సాగించారు. అవి సాగుతునే ఉన్నవి. ఇకమీదనూ సాగగలవు.

మనదేశంలోని మతాలు ఆస్తికములనీ, నాస్తికములనీ రెండు రకాలు. వేద ప్రామాణ్యాన్ని అంగీకరించే మతాలు ఆస్తికమతాలు. దాన్ని అంగీకరించనివి నాస్తికమతాలు—అంటే అవైదిక మతాలు.

మనదేశంలో ద్వైతం,అద్వైతం, విశిష్టాద్వైతం అనే ఆస్తికమతాలు బహుళ ప్రచారంలో ఉన్నవి. నాస్తికమతాలలో బౌద్ధమతం, జైనమతం ప్రధానమైనవి. గౌతమబుద్ధుడు స్థాపించిన బౌద్ధమత సిద్ధాంతాలు ఇవి— ''ఆశ ఉండడం వల్లనే జీవితం దుఃఖమయమౌతుంది. ఆ ఆశను విడిచిపెట్టినప్పుడే మానవుడు ముక్తిని పొందగలడు. ఆ ముక్తిని






పొందుటకు అష్టవిధ మార్గాలు తల్పబడినవి.

జైనమతంలో అహింసకూ, వైరాగ్యానికీ ప్రాధాన్యం ఇవ్వబడింది. ఆ మతాన్ని అవలంబించినవారు జన సామాన్యానికి ముఖ్యములైన అహింస, సత్యం, అస్తేయం, అపరిగ్రహం అనే నియమాలకు కట్టుబడి వుంటారు. సత్యాహింసలు అందరికీ తెలిసినవే. అస్తేయమంటే— ఇతరుల సొత్తును అపహరించకుండా ఉండటం. అపరిగ్రహమంటే ఇతరులు ఏమి యిచ్చినా తీసుకొనకుండా ఉండడం. వీటికి తోడుగా బ్రహ్మచర్యాన్ని కూడా మహావీరుడు చేర్చాడు.

మానవ జీవితాన్ని సరిదిద్దడమే ఈ మతద్వయం యొక్క ప్రధాన లక్ష్యంగా కానవస్తుంది.

ఆస్తికమతాలు లౌకిక విషయాలకంటె పారలౌకికాలకే ప్రాముఖ్యం ఇస్తున్నవి. సంసార బంధం నుంచి విడుదలపొందే మార్గం బోధించడం, తత్వజిజ్ఞాస వీటిలో ముఖ్యం. అహింస, సత్యం, అస్తేయం, అపరిగ్రహం మానవజాతికి సామాన్య ధర్మాలు కావడంవల్ల, అవి కూడా ఈ మతాలలో మిక్కిలి ఆదరణీయాలే. అయినా — అంతతో తృప్తిపడకుండా పారమార్థిక విషయాలకే ప్రాధాన్యం ఇస్తూ ఉన్నవి.

ఏమయినా — అన్ని మతాలలోను మానవాభ్యుదయానికి సముచితమైన స్థానం ఉన్నదనీ, దానిని సాధింప గలిగినప్పుడు మత విద్వేషాలకుగాని,మతాభినివేశానికిగాని అవకాశం లేదనీ గ్రహించాలి.

---

ఇంగ్లీషు వైద్యానికి తూగలేని బీదా బిక్కీ జనమో, లేకుంటే ఏ ఔషధమూ సేవించకుండానే నాలుగు రోజులు ఓరిస్తే వాటంతట అవే వెనకబట్టే రోగాలు... జలుబూ, దగ్గూ వంటి కాలికమైన సుస్తీలకో వెడుతూంటారాయన దగ్గరకు.

అసలు వైద్యం చేయించలేదనే నెపం లేకుండా, కేవలం కన్ను తడుపుకూ, మనసును మభ్యపరిచేటందుకూ మాత్రమే ఉపయోగపడుతుందాయన వైద్యం.

మరోసారి భారంగా నిట్టూర్చి 'ఏమన్నారాయన ?' అని ప్రశ్నించాడు నాగయ్య.

'పెద్దతనం. కాలూ, చెయ్యీ రావటం కష్టమేనన్నాడు. జ్వరం తగ్గడానికి మాత్రలు ఇచ్చి వెళ్ళాడు.'

'తల్లి ఇకపైన లేచి తిరుగాడలేదు. 'నాయనా నాగయ్యా !' అని తనని పిలవలేదు.' అనుకుంటే కడుపులో దుఃఖం సుడులు తిరుగుతో పైకుబుకుతోంది.

''కొడిగడుతున్న దీపం కొండెక్కడానికి ఎంతోకాలం పట్టదు శేషూ! ఈ నాల్గు నాళ్ళూ సేవించుకొనే భాగ్యఫలమే మనకు దక్కేది. అమ్మను జాగ్రత్తగా చూసుకో.'' అన్నాడు నాగయ్య డగ్గుత్తికతో.

బావగారు వెళ్ళిన తరవాత మగని మీద విరుచుకపడింది లక్ష్మీకాంత.

''అట్లా చూసుకో — ఇట్లా చూసుకో అని మనకి ఆజ్ఞలు జారీచేసే బదులు అంత బిమానం గలవాడు తన ఇంటికే తీసికెళ్ళి అత్తారుబతంగా చూసుకోవచ్చుగా ? అయినా మీరు మాత్రం అట్లా నోట్లో బెల్లంగడ్డ పెట్టుకు వూరుకోకపోతే, 'నువ్వూ కొడుకువే గదా తీసుకువెళ్ళి ఆ చెయ్యాలిసిన సేవలేవో నువ్వే చెయ్యమని చెప్పలేరూ మొహాన్ని?'' అంటూ గనమాయించింది.

భార్య ధోరణికి శేషయ్యకి తటు గాలి రేక్కొచ్చింది''చెపుదునేచెపుదును కానీ 'చాకిరీ చేయించుకున్నది నువ్వానూ, సేవలు చేయడానికి నేనూనా?' అని నా మొహాన్నే ఎదురు దులుపుతాడేమోనని బయపడి వూరుకున్నాను. చేతనయితే నువ్వే అను; ఆ పడాల్సిన నాలుగూ కూడా నువ్వే పడు.'' అంటూ దులిపి విసురుగాలేచి చక్కాపోయాడు.

మొట్టినట్టయి మౌనంగా వుండిపోయింది లక్ష్మీకాంత.

*   *   *

శేషయ్య అన్నదాన్లో అతిశయోక్తేమీ లేదు. రంగమ్మ రెక్కల కష్టం అధికంగా జుర్రుకున్నది శేషయ్య కుటుంబమే.

లక్ష్మీకాంత కాపురానికి వచ్చిన కొత్తలోనే అన్నదమ్ములిద్దరూ వేర్పాటు అయ్యారు.

ప్రాణంలేని పొలం పుట్రా, నోరులేని గొడ్డూ గోదాతోపాటు కన్నతల్లిని గూడా పంచేసి అన్నదమ్ములిద్దరూ తల్లిని చెరి ఆరునెలలూ పోషించాలని తీర్మానించారు పెద్దలు.

కానీ ఆ తీర్మానం అంత నిక్కచ్చిగా అమలుజరపడం పడలేదు: శేషయ్య దగ్గర వుండే గడువు కాలం పూర్తి అయ్యేవేళకి లక్ష్మీకాంతకి వేవిళ్ళు. మంచం దిగటంలేదు. ''తొలిచూలు వేవిళ్ళతో నలుగుతోంది తరవాత వస్తాలే.'' అన్నది రంగమ్మ. కాదన

# నమ్మూ నమ్మకపో!

సేకరణ : బి. శ్రీదేవి

**కల్తీ ప్రభావం!**

ప్రపంచ ప్రఖ్యాతి చెందిన అజంతా గుహలలోని చిత్రాలమీద తెల్లనిపూత ఏర్పడి బొమ్మలు మాసిపోతున్నాయి.

కారణం ?

బొమ్మలు మాసిపోకుండా ఉండడానికి వాటిపై ఒక రకమైన ఇటాలియన్ వార్నిష్ పూశారట, ఈమధ్య, ప్రభుత్వంవారు అయితే ఈ వార్నిష్ చవకబారుది అవడంతో, బొమ్మల మీద తెల్లనిపూత ఏర్పడుతోందట.

**కోతీ-మనిషీ!**

"ఇక బతకడు" అనుకొన్న 13నెలల బాబుని 16 గంటలపాటు ప్రాణాలతో నిలిపారు హేర్‌ఫీల్డు ఆసుపత్రి (లండన్) కి చెందిన డాక్టర్లు. ఇక ఆగిపోతుంది అనుకున్న బాబు గుండెను రక్తనాళాలతో ఒక కోతి గుండెకు కలిపారు. దానితో బాబు 16 గం.లు బ్రతికాడు. ఇంకా బ్రతికేవాడే కాని ఈలోగా కోతి మూత్రపిండాల్లో లోపం కలగడంతో కోతి చచ్చిపోయింది.

ఇలాంటి ప్రయోగం ప్రపంచంలో యిదే మొదటిది

**మావ్ జేదాంగ్!**

తమ పేర్లను విదేశీయులు పలుకుతున్నతీరు చూచి బాధపడి, చైనావారు తమ పేర్లను ఎలా వ్రాయాలో, ఎలా చదవాలో తెలియజేసే పుస్తకాల్ని ముద్రిస్తున్నారు. "మావ్ సేటుంగ్"ని "మావ్ జేదాంగ్" అనీ "చౌ ఎన్ లై"ని "జో ఎన్ లై" అనీ "పీకింగ్"ని "బీజింగ్" అనీ చదవాలట!

లేకపోయాడు నాగయ్య. రెండు బస్తాల ధాన్యమూ రెండు జతల పంచలూ తల్లికి పంపించి వూరుకున్నాడు.

ఆ తరవాతైనా అవసరార్థం ఏవో నాలుగు రోజులు వుండడం తప్పించి నాగయ్య ఇంట్లో వుండటం పడేదికాదు రంగమ్మకి.

లక్ష్మీకాంతకి దగ్గర కాన్పులు చంటి ఎంటా. శేషయ్య ఇల్లు వదలటానికి రంగమ్మ ఎప్పుడూ ఏ్ఆనుపడేదికాదు భార్య అనారోగ్య దృష్ట్యా తల్లి అవసరం తనకీ వున్నా మనవలని ముద్దుచేసే మురిపెంలో రంగమ్మ కూడా అటువైపే మొగ్గు చూపుతూండటంలో అభ్యంతరం చెప్పలేక పోయేవాడు నాగయ్య

దానాదీనా రంగమ్మ చిన్నకొడుకు ఇంటనే స్థిరమయిపోయింది నాగయ్య తల్లి ఖర్చు నిమిత్తం సాలుకీ రెండు బస్తాల ధాన్యమూ, బట్టలు కొనడానికయి కొంత పైకమూ తమ్ముడి కివ్వటం అలవాటు అయింది.

కాలమెప్పుడూ ఒకే విధంగా సాగిపోదు అనుకోని మలుపులు తిరిగి మానవాళిని దిగ్భ్రాంతుల్ని చెయ్యటం దాని సహజ నైజగుణం.

అన్నిటా శేషయ్యని అనుగ్రహించిన విధి నాగయ్యపట్ల పక్షపాతం చూపింది.

నాగార్జునసాగర్ పుణ్యమా అంటూ శేషయ్య మెట్టపొలాలు మాగాణమై బంగారు పండింది. దానితో, అతనికి సిరి ఎత్తుకుంది అతని గాదెలు పంట మాలక్ష్మితోనూ, అతని ఇల్లు పిల్లా పాపాతోనూ కల కలలాడేయి అతని జీవితం మూడు పువ్వులూ ఆరు

## లోకం పోకడ

కాయలుగా విలసిల్లింది.

వ్యవసాయంమీద మనసులేక అయినకాడికి భూములు తెగనమ్మి వ్యాపారంలోకి దిగిన నాగయ్య అదృష్టం వక్రించింది. అంతా నష్టపోయాడు. అంతేకాదు విధి అతన్ని పలు విధాలుగా వంచించింది.

వ్యాపారంలో నష్టపడి ఆర్థికంగా దిగజారి పోవటమే కాకుండా, పిల్లలు కలగక పోవటం ఒక వెలితిగా, భార్య దీర్ఘవ్యాధి గ్రస్తురాలు కావటం మరొక కలతగా అతన్ని కృంగదీసింది.

పెనుతుఫాను తాకిడికి కొమ్మలు రెమ్మలు విరిగిన వృక్షం మీద పిడుగుపడినట్టు పరిస్థితుల ఒత్తిడికి డస్సిపోయిన అతనిని విధి పగ పట్టినట్టు మరొక పిడికిలిపోటు పొడిచింది. అతని రోగిష్టిభార్య కన్నుమూసి అతన్ని ఒంటరిని చేసింది.

జీవితంలో అడుగడుగునా ఎదురు దెబ్బలు తిన్న వ్యక్తి చుట్టూరా ప్రపంచంమీద కసి పెంచుకుని దుర్మార్గుడయినా అవుతాడు; లేక కోరికల కతీతుడై విరాగి అయినా అవుతాడు.

నాగయ్యను చుట్టుకున్న బవబంధాలను ఈవిధంగా సడలించి అతన్ని తనవైపుకు మరల్చుకున్నాడా దైవం.

శాంత స్వభావుడైన నాగయ్య తనకు సంభవించిన ఈ విపత్తుల క్లేశభారం భగవంతునిపరం గావించి విముక్తుడయ్యాడు.

దైనందిన నిత్యకృత్యాలకు అవసరమయ్యే ఏ కొద్ది కాలమో మినహా మిగతా సమయామంతా ఆధ్యాత్మిక గ్రంథ పఠనంలోనూ, దైవధ్యానంలోనూ గడుపుతూ వస్తున్నాడు ప్రస్తుతం

మోడుబారిన కొడుకు బ్రతుకుని తలిచి ఎంతయినా పరితపించేది రంగమ్మ.

ఉండబట్టలేక ఒకసారి, "ఆడదక్షత లేని సంసారమయింది వాడిది. ఒక్కడూ చెయ్యి కాలుకుని ఏమియాతన పడుతున్నాడో ఏమో.. పోనీ నేను వాడిదగ్గరకు వెళ్లి వుందునా ?" అని తన అభిలాషను వెల్లడించింది.

కానీ అందుకు శేషయ్యగానీ లక్ష్మీకాంత గానీ సుముఖత వ్యక్తపరచలేదు.

"అన్నయ్య స్థితి ఏమంత వెలిగిపోతోందని నువ్వు అక్కడికి జేరతానంటున్నావమ్మా? ప్రతి ఏడూ నీకని ఇస్తున్న కొద్దిపాటి మొత్తంకూడా ఈ ఏడాది ఇవ్వలేక పోయాడు తెలుసునా ? వాడి భుక్తికే కట కట పడుతూంటే నువ్వు వెళ్ళి మరో భారం వాడి భుజాన మోపుతా నంటావేమిటి?" అని సన్న సన్నగా శేషయ్య మందలించగా—

కట్టుగొయ్యకు కట్టడానికి ప్రయత్నించే పాలేరుకి అలవిగాకుండా గింజుకుంటున్న ముసలిగేదెమీద పెట్టి, "ఒదిలెయ్యరా ఎక్కడికెడుతుందో నూ... రెండు రోజులు డొక్కమాడితే ఇల్లెక్కడుందా అని అదే వెతుక్కుంటూ వస్తుంది ముప్పొద్దులా మేపి సుఖంగా ఒకచోట పడుండవే అంటే నీలుగుతోంది...నీలుగు." అంటూ పరోక్షంగా అత్తగారిని వెటకారంగా ఈసడించింది లక్ష్మీకాంత.

ఇందులో భార్యా భర్త లిద్దరూ కలిసి

మరుగుచేసిన విషయమొకటున్నది. నాగయ్య తల్లికంటూ ప్రతిఏడూ ఇస్తున్న మొత్తాన్ని ఆఏడు ఇవ్వలేకపోయిన మాట వాస్తవమే. అలా ఇవ్వలేక పోయినందుకు చాలా కించపడ్డా డతను. ఆ సంగతి తమ్ముడితో చెప్పలేక చెప్పలేక చెబుతూ, "పోనీ అమ్మని నా దగ్గ రికి పంపెయ్యి. ఉన్నదానిలోనే కలో గంజో తాగుతాము. అయినా ఒకసారిగా అంటే ఇవ్వలేనుగానీ దినసరి బత్యానికి లోటు లేదులే నాకు." అని తనకు వెసులుబాటుగా వుండే మార్గాన్ని సూచించాడు.

[ఇంకా వుంది]

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## లంకెలేని అంకితం

ప్రతివారూ ముద్రణ వ్యయం గిడుతుందనో, మరే పదవో, ప్రాపకమో ఉంటుందనో పుస్తకాలు అంకితం ఇస్తుంటారు. కాని మిత్రులు శ్రీ రావూరి సత్యనారాయణరావు ఎలాంటి లంకె లేక జులై 2వ తేదీన తమ నూతన నవల "ఈ గాలి వీచింది" అనేదాన్ని తనయులకు ఆశీర్వాదపురస్కారంగా భాషా కుటీరంలో అంకితమిచ్చి నూతన సంప్రదాయం సృష్టించారు. ఈ నవల మొన్న ఉగాదినాడు జరిగిన ప్రపంచ తెలుగు మహాసభలకు వచ్చిన విదేశీ ప్రతినిధుల సౌజన్య సౌమన్యాలు ఆధారంగా రచితమయింది. ఈ లంకెలేని అంకితోత్సవానికి మాజీ న్యాయమూర్తి శ్రీ వల్లూరి పార్థసారధి అధ్యక్షత వహించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం కులపతి శ్రీ ఎం. ఆర్. అప్పారావు నవలను ఆవిష్కరించారు. వారిద్దరూ, డాక్టర్ దివాకర్ల వేంకటావధాని, డాక్టర్ బిరుదురాజు రామరాజు రావూరి రచనా వైవిధ్యాన్ని గురించి, సమైక్య, సౌశీల్యాలను గురించి ప్రసంగించారు. డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యం నవలను సమీక్షించారు. శ్రీ రావూరి ఈ నవల రచనకు కలిగిన దోహదం గురించి ప్రసంగించిన తర్వాత శ్రీ నార్ల గౌరీశంకర్ ధన్యవాదాలర్పించారు.

## విద్యార్థినుల ఉద్యమం

హైదరాబాద్ హోం సైన్సు కళాశాల విద్యార్థినులు యితరులకు మార్గదర్శకంగా ఉత్తమ ఉద్యమం ప్రారంభించారు. హైదరాబాద్ శివారులోని అజీజునగర్, కిస్మత్‌పూర్ మొదలయిన గ్రామాలకు వెళ్లి, ప్రజలకు ఆరోగ్య సూత్రాలు వివరించి మురికివాడలను పరిశుభ్రం చేయడానికి పూనుకున్నారు. తలిదండ్రుల నిర్లక్ష్యం కారణంగా పిల్లలకు కలిగే జబ్బులను గురించి, వాటి నివారణను గురించి వారికి తెలియజేసి, ఇళ్లను, పేటలను ఎలా శుభ్రంగా ఉంచుకోవాలో తెలియజెబుతున్నారు. మురికినీరు చేరడానికి తగిన గుంటలను త్రవ్వి చూపుతున్నారు.

## రంగులలో హైదరాబాద్ దృశ్యాలు

హైదరాబాద్ సౌందర్యాన్ని గురించి సుప్రసిద్ధ ప్రాచీన చరిత్రకారుడు ఫెరిస్తా ఎంతగానో వర్ణించాడు. ఇటీవల రాజకీయ కారణాలుగా మురికిపేటలు కొన్ని లేచినా, నగర సౌందర్యమేమీ తగ్గలేదు. ఈ సౌందర్యాన్నే యువచిత్రకారుడు శ్రీ ఎల్. నరేంద్రనాథ్ రంగులతో చిత్రించి జూన్ 27 నుంచి జులై 3 వరకు కళాభవన్‌లో ప్రదర్శించి ప్రేక్షకులను— ఆకర్షించారు. ఈ ప్రదర్శనాన్ని లలితకళా అకాడమీ కార్యదర్శి శ్రీ పి. టి. రెడ్డి ప్రారంభించారు. దీనిలో తైల చిత్రాలు, వర్ణ చిత్రాలు మొత్తము 29 ఉన్నాయి. చార్‌మినార్ ట్యాంక్‌బండ్ మొదలయిన చిత్రాలు అపూర్వ రామణీయకంతో ఉన్నాయి. శ్రీ నరేంద్రనాథ్ 25 సంవత్సరాల యువకుడు. తనంతటతానే చిత్రాలు గీయడం ఆరంభించి, వృద్ధిపరచుకున్నారు. ఇది ఈయన మొదటి ప్రదర్శనం. ప్రేక్షకుల, కళా విమర్శకుల సూచనలపై తను తన కౌశల్యాన్ని పెంపొందించుకొనడానికి యత్నిస్తానని ఆయన నాతో అన్నారు. ఆ సంకల్పం ఆయన కళ్లల్లోను, మాటలలోను తొణికిసలాడింది.

## విద్యుత్కవితా సమ్మేళనం

"వచన కవిత చెప్పడం తేలికైన పని అని పలువురి తలంపు. అది కేవలం భ్రమ. కవితకైనా, వచన కవితకైనా భావపు బరువు అవసరం. ధ్వని భావగాంభీర్యం లేనప్పుడు అది కవిత్వమనిపించుకోదు. పిల్లి మనందరికీ తెలుసు. పాయిలో పిల్లి లేవలేదు అనగానే వంట కాలేదనో, దారిద్ర్యమనో, ఉరవస్థ అనో ధ్వనిస్తుంది. పిల్లలు నిద్రపోయారు అంటే వార్తా కథనం. పూవులు నిద్రపోయాయి— అంటే కవిత. కనుక వచన కవిత కత్తి మీద సాము వంటిది" అన్నారు జులై 7వ తేదీన విద్యుత్ కళా సమితివారు ఏర్పాటుచేసిన మహిళల కవితా గోష్ఠికి అధ్యక్షత వహించిన డాక్టర్ నాయని కృష్ణకుమారి. ఆమె అగ్నిపుత్రి, నేను— సముద్రం అనే రెండు వచన కవితా ఖండికలు వినిపించారు. కవితాగోష్ఠిలో శ్రీమతులు పరిమళాసోమేశ్వర్, శారదా అశోక్‌వర్ధన్, పండా శమంతకమణి, రాణి కమలా దేవి, ఆచంట రుక్మిణి, జి. విజయలక్ష్మి మున్నగు వారు పాల్గొన్నారు. శ్రీ మర్ల అప్పారావు స్వాగతం చెప్పారు. శ్రీ ఉమాపతి ధన్యవాదాలతో గోష్ఠి ముగిసింది. ప్రపంచ మహిళా సంవత్సరం సందర్భంగా ఈ గోష్ఠి ఏర్పాటయింది.

## బస్సుసర్వీసు అభివృద్ధి

జంటనగరాలలో బస్సు ప్రయాణీకుల తీరుతెన్నులు పరిశీలించి, దానిని అభివృద్ధి చేయడానికి సంకల్పించామని రోడ్డు రవాణా సంస్థ జనరల్ మేనేజరు శ్రీ అజిత్‌సింగ్ జులై 1వ తేదీన పత్రికా ప్రతినిధులతో అన్నప్పుడు, నాకు నిజంగా సంతోషం కలిగింది. శ్రీ అజిత్‌సింగ్ కార్యశూరుడు. ఆయన చెప్పింది చేయగలడు. ఈ పరిశీలనను ఇంజినీర్స్ ఇండియా అనే సంస్థ చేస్తుందని మూడు నెలలో దాని నివేదిక అందుతుందని, తదనుగుణంగా సౌకర్యాలు, మార్పులు జరుగుతాయని ఆయన అన్నారు.

## సర్వజనులకు పూజ

మంత్రి శ్రీ సాగి సూర్యనారాయణరాజు తిరుమల తిరుపతి దేవస్థానం హిందూ ధర్మ ప్రతిష్ఠానం యాజమాన్యాన జులై 7వ తేదీ నుంచి బాలాజీ భవన్‌లో ప్రారంభమయిన హవన, వేదాధ్యయన హిందూ ధర్మ ప్రవచన యజ్ఞానికి అధ్యక్షత వహించిన సందర్భంలో ప్రసంగిస్తూ, హిందూ ధర్మాన్ని ప్రచారం చేయడం అవసరమన్నారు. ఈ సమయంలో ఆయన ఈ ప్రతిష్ఠానం ప్రచురించిన "సర్వజనులకు పూజ" అనే గ్రంథాన్ని ఆవిష్కరించారు. యజ్ఞ కార్యక్రమాన్ని శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణజీయర్ ప్రారంభిస్తూ, ప్రపంచమంతటా ధర్మసారం ఒకటేనన్నారు. హిందూ ధర్మ ప్రతిష్ఠానం వేద ధర్మ సముద్ధరణకు పూనుకున్నదన్నారు. వేదాధ్యయన కార్యక్రమ అధ్యక్షులు శ్రీ ఉప్పులూరి గణపతిశాస్త్రి ప్రస్తుత పరిస్థితిలో వేద ప్రాధాన్యం గురించి ప్రసంగించారు. దేవాదాయ ధర్మాదాయ శాఖ కమిషనర్ శ్రీ కె. పురుషోత్తమనాయుడు, దేవస్థానంకమిటీ అధ్యక్షుడు శ్రీ సి. అన్నారావు ధర్మ ప్రతిష్ఠానం కార్యక్రమం వివరించారు. ఈ కార్యక్రమం నిరంతరం సాగుతుంది.

## ఉపశ్రుతి :

"ఏమిటి మీ అబ్బాయి చాల క్రమశిక్షణతో పెద్దలను అనుసరిస్తున్నట్టున్నాడే"? అన్నాను ఒకమురుకైన విద్యార్థిని చూసి, అతని తలిదండ్రులతో. "అవునండీ! ఇంటిల్లిపాదీ లేచిం తర్వాతే లేస్తున్నాడండీ ఇటీవల" అన్నారు వారు. ●

## కరూర్ వైశ్యబ్యాంకు కళాభిమానం



ఆంధ్రప్రదేశ్ విద్యుత్ బోర్డు సభ్యులైన శ్రీ కె. ఆర్. అయ్యర్ కుమార్తె కుమారి మైథిలీ రామకృష్ణ జూన్ 8న మదరాసులోని రామారావు కళామంటపంలో నృత్య ప్రదర్శన యిచ్చిన సందర్భంలో ఆమెకు కరూర్ వైశ్య బ్యాంకు లిమిటెడ్ వారు రజిత ఫలకాన్ని బహూకరించారు.

## 1-8-1975 శుక్రవారం మొదలు
## 7-8-1975 గురువారం వరకు

# వారఫలం

—మహేష్—

**మేషం :—** రావలసిన డబ్బు అందుతుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. వ్యాపారంలో పోటీవారి పోటీ తగ్గుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. మీ మంచితనం మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**వృషభం:—** వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ ఖ్యాతి రాణిస్తుంది. ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. ప్రయాణాలు వాయిదాపడతాయి. మిత్రులకు సహాయం చేస్తారు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**మిథునం:—** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వృత్తిలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు బాగుంటాయి. వ్యతిరేకమైన వార్తలను వింటారు.

**కర్కాటకం:—** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. రావలసిన డబ్బు అందుతుంది. వారం మధ్యన అధిక వ్యయం జరుగుతుంది. చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**సింహం :—** అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం ఆఖరులో ఎవరినీ విశేషంగా నమ్మడం తగదు. స్త్రీలకు— బంధు మిత్రులను కలుసుకొంటారు. విలాస వస్తువులు కొంటారు.

**కన్య :—** అనుకూలమయిన వార్తలను వింటారు. రావలసిన డబ్బు అందుతుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన విషయాలు తెలుసుకొంటారు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల:—** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం మధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకుంటారు. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**వృశ్చికం :—** మీ ఆలోచనలు ఫలిస్తాయి. రావలసి డబ్బు అందుతుంది. వారం మధ్యలో చికాకులు ఏర్పడతాయి. సాహసిక వ్యవహారాలలో నష్టం రాగలదు. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. బంధు మిత్రులను కలుసుకుంటారు.

**ధనుస్సు :—** వృత్తిలో శ్రమ మీద అనుకూలత లభిస్తుంది. పోటీవారితో మాటపట్టింపులు తగవు. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో ముఖ్యమయిన వ్యక్తులను కలుసుకుంటారు. వారం ఆఖరులో ఫలితంలేని శ్రమ కలుగుతుంది. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**మకరం :—** ముమ్మందు లాభించగల వ్యవహారాలలో అభివృద్ధి సాధిస్తారు. మిత్రుల సహాయం లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**కుంభం :—** మీ కార్యక్రమాలు అడావుడిగా ఉంటాయి. పోటీవారిలో గౌరవం బాగుంటుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారంఆఖరులో అనవసరమైన సందేహాలు కలుగుతాయి. స్త్రీలకు— బంధువులకు సహాయం చేస్తారు. విలాస వస్తువులు కొంటారు.

**మీనం:—** వ్యాపారంలో పోటీవారి పోటీ తగ్గుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

# ఇళ్లాలై "పోతున్న" ఎర్‌హోస్టెస్‌లు

మన్మథుడీ మధ్య ఏర్ ఇండియా వారిని మహా ఇబ్బంది పెట్టేస్తున్నాడట. ఇతగాడు మరెక్కడా చోటు దొరకనట్లు ఏర్ ఇండియా విమానాలలో చొరబడి వారి హృదయం వీరికి, వీరి హృదయం వారికీ బట్వాడా చేయడంతో ఏర్ ఇండియా యాజమాన్యానికి పెద్ద సమస్య వచ్చిపడింది.

ఈ సంవత్సరం మొదటి ఆరు నెలల లోనే తమ హృదయాలు మరొకరికి సమర్పించిన కారణంగానో, మరొకరి హృదయాలు తాము సేకరించిన కారణంగానో 40 మందికి పైగా ఏర్ హోస్టెస్‌లు పెళ్ళిళ్ళ చేసుకుని ఉద్యోగాలకి గుడ్‌బై కొట్టి వెళ్ళిపోయారు. ఏర్ ఇండియా చరిత్రలోనే ఇంతమంది ఇంత తక్కువ కాలంలో ఉద్యోగాలు వదు- కుని పోవడం ఇదే ప్రథమం.

ఈ పరిస్థితి చూసి ఆందోళన చెందిన యాజమాన్యం ఇప్పుడు ఏర్ హోస్టెస్ ఉద్యోగాలకు అమ్మాయిలను తీసుకోవడానికి గానూ ఒక అత్యవసర కార్యక్రమాన్ని చేపట్టింది. ఒకమ్మాయికి ఏర్‌హోస్టెస్‌గా శిక్షణ ఇవ్వడానికి యాజమాన్యానికి 5 వేల రూపాయలు ఖర్చవుతుందిట.

"ఏర్‌హోస్టెస్ ఉద్యోగాలకోసం వచ్చే అమ్మాయిలకు అందం,ఆకర్షణ వంటి ప్రత్యేక లక్షణాలు వుండాలి. వధువుకోసం వెతుక్కునే యువకులు చూసేవి కూడా ఈ లక్షణాలే. అందుకే ఏర్‌హోస్టెస్ ఉద్యోగానికి సెలెక్ట్ అయిన అమ్మాయి అంటే వధువుగా అన్ని విధాలా అర్హతగల అమ్మాయి అన్నమాట!" అన్నారు ఏర్ ఇండియా కస్టమర్ సర్వీసెస్ కమర్షియల్ మేనేజర్.

ఏర్ ఇండియాలో 400 మంది ఏర్ హోస్టెస్‌లు పని చేస్తున్నారు. వారిలో భారతీయులేగాక ఫ్రెంచి, జర్మన్, స్విస్. ఇటాలియన్, ఇంగ్లీషు, ఆస్ట్రియన్, జెకోస్లవాక్, జాపనీస్ అమ్మాయిలు కూడా ఉన్నారు.

# హిందీలో వెలువడిన కొన్ని తెలుగు రచనలు

**దండమూడి మహీధర్**

ఇప్పటికి ఏభైనాలుగు సంవత్సరాలక్రితం అంటే 1921 లో ఆంధ్ర దేశంలో హిందీ భాషకు పునాదులువేసి, ఆపైని హిందీ - పట్ల ఆంధ్రులకు అభిమానాన్ని రేకెత్తించే ఉద్దేశ్యంతో కలం చేపట్టి, 'హిందీ స్వబోధిని' అనే ప్రప్రథమ హిందీ గ్రంథ రచనకు నాంది వాచకం పలికిన ప్రప్రథమ వ్యక్తి పద్మశ్రీ మోటూరి సత్యనారాయణగారు 1927 నుంచి దక్షిణభారత హిందీ ప్రచార సభకు కార్యదర్శిగా వుంటూ 'హిందీ ప్రచార సమాచార్' 'దక్షిణ భారత్' అనే పత్రికలకు ఎడిటర్‌గా వుంటూ అనేక వ్యాసాలు, గ్రంథాలు రచించి ఆంధ్రుల సంస్కృతీ, సాహిత్య సంపదను హిందీవాళ్లకు అందించిన ఖ్యాతికూడా వారికే దక్కుతుంది.

ఆ తరువాత పేర్కొనదగిన ఆంధ్ర హిందీ రచయితల జాబితాలోకి ప్రొఫెసర్ జి. సుందర రెడ్డి, వారణాసి రామమూర్తి 'రేణు', డాక్టరు ఇలపావులూరి పాండురంగారావు, డాక్టరు ఎస్. టి. నరసింహాచారి, డాక్టరు చావలి సూర్య నారాయణమూర్తి, వేమూరి ఆంజనేయ శర్మ, పి. వి. నరసింహారావు, డాక్టరు భీమసేన్ 'నిర్మల్' ఏ. రమేశ్ చౌదరి, బాలశౌరిరెడ్డి, వేమూరి రాధాకృష్ణమూర్తి, డాక్టరు పి. ఆదేశ్వరరావు, ఆలూరి బైరాగి, శ్రీ అన్నాబత్తుల హనుమచ్ఛాస్త్రి దండమూడి వెంకటకృష్ణారావు మొదలైన వారిని పేర్కొనవచ్చును.

వీరిలో చాలామంది తెలుగు సాహిత్యాన్ని గురించి, సంస్కృతిని గురించి హిందీలో గ్రంథాలు రచించి అపారమైన పేరుప్రఖ్యాతులు గడించినవారే! వీరి రచనలకు కేంద్ర ప్రభుత్వ బహుమతులు, ఉత్తర ప్రదేశ్, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ బహుమతులు కూడా లభ్యమైనాయి.

శ్రీరామమూర్తి 'రేణు' గారు హిందీలో 'విహగగీత్' అనే హిందీ కావ్యాన్ని రచించారు. 700 గీతాలతో 'దేశింగురాజు కథ'ను సృష్టించారు. 'ఆంధ్రదేశ్‌కే కబీర్ వేమన' అనే గ్రంథం వీరికి అశేషమైన కీర్తిని ఆర్జించి పెట్టింది. దీన్ని అలహాబాదు హిందీ సాహిత్య సమ్మేళన్ వారు ప్రచురించారు. వీరురాసిన మరొక గ్రంథం 'ఆదాన్‌ప్రదాన్' కూడా హిందీ రచయిత మహాదేవివర్మ ఆధ్వర్యంలో నిర్వహించబడే 'సాహిత్య కార్‌సంసద్' పక్షాన ప్రచురించబడి అశేష హిందీ పాఠకుల ఆదరాభిమానాలను చూరగొన్నది. ఇటీవలే వీరు రచించిన మరో గ్రంథానికి కేంద్ర ప్రభుత్వ బహుమతి లభించింది. ఆ గ్రంథంపేరు 'సాహిత్యక్ ఆదాన ప్రదాన్'! తెలుగు సాహిత్యాన్ని గురించిన 32 వ్యాసాలు ఇందులో వున్నాయి. ఇంతటి వైవిధ్యంతో కూడుకున్న రచన హిందీలో మరొకటిలేదని చెప్పవచ్చును.

మౌలిక రచనలతోపాటు అనువాదాలు చేయడంలో కూడా వీరు అందెవేసిన చెయ్యిగా నిరూపించుకున్నారు—'భాగవత్ పరిమళ' పేరు ఆంధ్ర మహా భాగవతాన్ని హిందీలోకి అనువదించి! ఈ గ్రంథానికి రాష్ట్ర ప్రభుత్వ బహుమతి ప్రాప్తించింది. గుర్రం జాషువా రచించిన 'గబ్బిలం' కావ్యాన్ని కూడా హిందీలో అనువదించి తమ అసమాన అనువాద నైపుణ్యాన్ని ప్రదర్శించుకున్నారు.

డాక్టరు ఇలపావులూరి పాండురంగారావు గారు రచించిన అనేక గ్రంథాలకు ప్రభుత్వ బహుమతులు లభ్యమైనాయి. వీరు హిందీలో ఆలూరి బైరాగి తరువాత ప్రతిభావంతంగా ఒక స్వంత శైలిని ఏర్పరచుకొని ఉత్తరాదివారిని ఆశ్చర్యపడేట్లు కవిత్వం చెప్పిన ఖ్యాతి వీరి కొక్కరికే దక్కిందని చెప్పవచ్చు! 'శ్రీ కామాక్షి స్తవన' అనే కావ్యాన్ని రచించి కామకోటి పీఠాధిపతిచే 'కవిరత్న' అనే బిరుదాన్ని పొందారు. 'ఆంధ్ర హిందీ రూపక్'అన్న వీరి విమర్శ గ్రంథం హిందీలో ఎంతో పేరు సంపాదించుకున్నది.

ఇక వీరి అనువాదాల విషయానికొస్తే హిందీలో వెలువడిన 'తాశ్ కే పత్తే' ముప్పాళరంగనాయకమ్మ నవల 'పేకమేడలు' హిందీ అనువాదం, బలివాడ కాంతారావు 'ఇదే నరకం ఇదే స్వర్గం' నవలకు 'గిరాం అనయూన్ నయూన్ బిను బానీ' అనే పేరుతో చేసిన అనువాదం, శ్రీయుతులు పురాణం సుబ్రహ్మణ్యశర్మ, వాకాటి పాండురంగారావుగార్లు నేషనల్ బుక్‌ట్రస్ట్ వారికి ఎడిట్‌చేసిన 27 తెలుగు కథల్ని 'కథ భారతీ— తెలుగు కహానియాఁ' అనే పేరుతో చేసిన అనువాదం—ఈ మూడూ వీరి విశేష ప్రజ్ఞాప్రాభవాలకు నిదర్శనంగా నిలిచిపోగల రచనలని చెప్పవచ్చును. ఇంత ప్రతిభావంతంగా అనువాదం చేయడం అనేది చాలా గొప్ప విషయం. దీనికి కారణం వీరు హిందీ తెలుగు భాషల్లో నిష్ణాతులు కావడమే!

ప్రొ. జి. సుందరరెడ్డి గారు రచించిన హిందీ అవుర్ తెలుగు — ఏక్ తులనాత్మక్ అధ్యయన్' 'దక్షిణ కీ భాషాయేఁ తథా సాహిత్య' 'సాహిత్య అవుర్ సమాజ్' 'మేరే విచార్' 'హిందీ తథా ద్రావిడ్ భాషావోంకే సమాన్ రూపీ భిన్నార్థీ శబ్ద్' అనేవి ప్రముఖంగా పేర్కొనదగిన రచనలు! డాక్టరు ఎస్. టి. నరసింహాచారి 'సాహిత్యక్ అభిరుచి తథా సమీక్ష' అనే పరిశోధనా గ్రంథం రచించి గణుతికెక్కారు.

**(సశేషం)**

## స్వాతి వాన

ప్రళయాగ్ని

నాడి దొరకని వైద్యుడిలా
నలు దిక్కులా చూస్తోంది కన్ను,
లక్ష్యం తెలీని బాణంలా
నిరీక్షిస్తోంది పెన్ను,
కన్నుకీ, 'పెన్ను'కీ మధ్య
కళాయి గిన్నెలో వెన్నలాగ
కపాలంలో మెదడు
వూహల స్వాతి చినుకుల కోసం
నోరు తెరచుకున్న ముత్తెపు చిప్ప
కవి గుండె.
తన వరకూ రానిస్తాయా ?
దిగమింగే తిమింగలాలు

ఆనందం, నిర్వేదం
అధికమైనా, మృగ్యమైనా
ఫలితం శూన్యం!
బయట జడివాన కురిసినప్పుడు
మంచం కింద కుంపటి సెగలాగ
నోరు వెచ్చగా తగలాలి అనుభూతి.

అప్పుడు కవిత్వం శిశువు
మత్తులోంచి కాస్త ఒత్తిగిల్లుతుంది.
అప్పుడు అనిపిస్తుంది—
మెరుపుల కొండాలు
మబ్బుల్ని చరుస్తున్నట్టు
నింగికీ నేలకూ మధ్య
జలతారు తివాసీ పరుస్తున్నట్టు
వాన కురుస్తున్నట్టు
పూలు విరుస్తున్నట్టు
జ్వరం విడుస్తున్నట్టు
కళ్ళు స్రవిస్తున్నట్టు
వెన్నెల ప్రసరిస్తున్నట్టు. ○

పట్టుకుని "బాధపడకు నాయనా" అంటూ మురళి వీపుమీద చెయ్యివేసింది జోగమ్మ.

మురళికి దుఃఖం పెల్లుబికి వచ్చింది... "ఇంకీ మందు ఎవరికోసం అత్తయ్యా? ఇంతమంచి మందు దొరికింది. ఇంక నాన్నకి ఫరవాలేదు అనుకున్నాను... కాని నాతో కడసారి మాట అయినా చెప్పకుండా వెళ్ళిపోయాడు...నాన్న నా మీద కోపగించి వెళ్ళిపోయాడు" అంటూ పసివాడిలాగ బావురుమన్నాడు...ఎంతమంది ఎన్నిరకాలుగా ఊరుకోబెట్టినా ఉషా మురళీల దుఃఖం ఆగటంలేదు.

"అసలింత చప్పుని ఇలా ఎందుకు ముంచుకొచ్చిందో...పొద్దున్న బాగానే ఉన్నారు... ఇవాళ మందు ఇచ్చావా ఉషా?" అన్నాడు ప్రభాకరం.

ఉష తల ఊపింది.

"ఏం తిన్నారు ఇవాళ?"

"ఇంకా ఏదీ?...అన్నం ఇంకా వండకముందే ఆ మాత్రలు వేసుకుని పడుకున్నాడు" అంది ఉష ఏడుపు మధ్యలో ఆపుకుంటూ...

"మాత్రలా?"

"ఊఁ.. నిద్దర మాత్రలు ... అంకరాజు ఇచ్చివెళ్ళాడు, ఇంకా ఒక మాత్ర ఉంటే ఆ స్టూలుమీద పెట్టాను"

స్టూలుమీద మాత్ర చూస్తూనే అరిచాడు ప్రభాకరం "అంకరాజు మీ నాన్నని చంపేశాడు!" అంటూ.

అక్కడ చేరిఉన్న జనంతోపాటు, అప్పుడే వస్తూన్న సీతాలు కూడా ఆ మాట విని అదిరిపడ్డాడు.

"అంకరాజు ఈ మాత్రలు ఇవ్వకపోతే ఇంతలో ఇంత ప్రమాదం వచ్చిపడేదికాదు..."

"అయితే ఆ హంతకుణ్ణి ఊరికే వదిలెయ్యకు వదు" అంటూ అరిచారు వెనక

## గాజు మేడ

( 9వ పేజీ తరువాయి )

నుంచి ఎవరో ... "వదలడం ఏమిటి? ఇప్పుడు జుట్టు పట్టుకుని ఈడ్చుకుని రానూ?" అంటూ హుంకరించి సీతాలు అటు పరిగెట్టాడు. అతని వెనకాల ఊళ్ళో అయిదారుగురు మనుష్యులు కూడా వెళ్ళారు. వాళ్ళు అంకరాజు కోసం ఊరంతా గాలించి తిరిగి వచ్చేసరికి అర్ధరాత్రి దాటింది

"ఊరొదిలి పారిపోకపోతే ఈపాటికి నా చేతిలో చచ్చిఉండేవాడు" అన్నాడు సీతాలు.

"ఇలా జరుగుతుందని ముందే తెలుసు కాబోలు. అందుకే డబ్బూ దస్కం అన్నీ తీసుకుని ఓ గంట క్రితమే, పట్నం మిల్లుకి వెళుతూన్న ధాన్యం లారీలో, ఉడాయించాట్ట" అన్నాడు ఊరంతా వాకబు చేసివచ్చిన మరో ఆసామీ...

రాత్రి తెల్లవార్లూ ఉష ఏడుస్తూనే ఉంది. మురళి గోడకి జేర్లావడి స్థాణువులా ఉండిపోయాడు. "కడుపు ఉబ్బిపోయేలా ఏడుస్తోంది పిల్ల... శవాన్ని తీసుకువెళితేనేకాని కడుపులో ఈ మంటా బాధా తగ్గదు. కాసిన్ని మంచినీళ్ళు తాగించలేకపోతున్నాను దానిచేత ... తర్వాత కార్యక్రమం చూడు ప్రభాకరం" అంది జోగమ్మ.

తెల్లారుతూండగా భద్రయ్య శవాన్ని ఎత్తుతూన్నప్పుడు ఉషని పట్టుకోవడం కష్టం అయిపోయింది. "వెళ్ళిపోతున్నావా నాన్నా!" అంటూ గడపకి అడ్డంగా చాపచుట్టలా పడిపోయింది. ముఖంమీద గుడ్డ కప్పుకుని ఓ చేత్తో నిప్పు పుచ్చుకుని వెక్కి వెక్కి ఏడుస్తూన్న మురళిని అతి ప్రయత్నం మీద ముందుకి నడిపించాడు ప్రభాకరం.

మధ్యాహ్నం బాగా పదకొండు దాటాక కాని ప్రభాకరం, మురళీ, సీతాలూ తడిబట్టలతో ఇంటికి రాలేదు శ్మశానానికి వచ్చిన పాతిక ముప్ఫైమంది జనం తిరిగి ఎవరింటికి వాళ్ళు వెళ్ళిపోయారు ఉషకి స్నానం చేయించి, బలవంతాన ఇంత కాఫీ తాగించి ఇంటి దగ్గర వంట ప్రయత్నాలూ అవీ చేయించి, కావలసినవన్నీ పురమాయించి, ప్రభాకరం మురళీ వాళ్ళ రాకకోసం వేచి ఉన్న జోగమ్మ వాళ్ళని చూస్తూనే 'వచ్చారా బాబూ' అంటూ గద్గదికమైన కంఠంతో పలకరించింది...

"నాన్నని వదిలేసి వచ్చావా అన్నయ్యా!" అంటూ ఏడ్చేసింది ఉష.

"అబ్బాయి... వీళ్ళనిద్దర్నీ ఇక్కడ వదిలేస్తే లాభంలేదు .. ఇలా ఏడుస్తూనే ఉంటారు... ఇంటికి తాళం వేయించు ... కొన్నాళ్ళు మనతోపాటు మనింటిదగ్గర ఉంటారు..." అంది జోగమ్మ

ప్రభాకరం "అవును...నిజమే" అంటూ లేచాడు...



వ్యంగ్య చిత్రకారుడు ఎగ్గోని శ్యామసుందర్‌కి చి. సౌ. రాజ్యలక్ష్మికి 30 5 1975 న అమలాపురంలో వివాహం జరిగింది.

# గా జు మే డ

"నే నె క్క డి కీ రాలేను...నన్ను ఇక్కడే ఉండనియ్యండి" అన్నాడు మురళి.

"ఇవి చూసుకోడానికి మా కు మి గి ల్చి, నువ్వు వెళ్లిపోయావా నా న్నా" అంటూ తిరిగి బావురుమంది ఉష మూల నున్న భద్రయ్య చేతి కర్రా, చెప్పులూ చూసి.

"చూశావా? ఇంట్లో ప్రతివస్తువూ ఇలా మీ నాన్నని జ్ఞాపకం చేస్తూంటే ఈ బాధని అది ఎప్పటికి మరిచిపోతుంది? పెద్ద దాన్ని నేను చెప్తున్నాను. నా మాట కాదనక, రా, నాయనా" అంది జోగమ్మ మురళితో.

ప్రభాకరం, ఉషా, మురళి జోగమ్మా నలుగురూ ఇవతలికి వచ్చి,సీతాలు చేత ఇంటికి తాళం వేయిస్తున్నప్పుడు "టెలిగ్రాం సార్" అంటూ మె సెం జర్ వచ్చి ప్రభాకరం చేత సంతకం పెట్టించుకొని టెలిగ్రాం ఇచ్చి వెళ్ళి పోయాడు. "ఇది మురళి పేర వ చ్చిం ది" అంటూ విప్పి "హుఁ!... ఈ స మ యం లో వచ్చింది కాని ఇదే పది హేను రోజులు ఇటో అటో వస్తే నా, ఎంతసంతోషించే వా ళ్ళం" అంటూ నిట్టూర్చాడు ప్రభాకరం.

"ఏవిట్రా అది?" అంది జోగమ్మ.

"ఢిల్లీ చిత్రకళా ప్రదర్శనంలో మనమురళి వేసిన 'సంధ్యాదేవి కళ్యాణవేదిక' చిత్రానికి సెకండ్‌ప్రైజు వెయ్యిరూపాయలు వచ్చిందట. ఇతని ఫోటో, జీవిత విశేషాలూ పంపించ మన్నారు" అన్నాడు

ఉష కళ్లల్లో ఒక్క మెరుపు మెరిసి వెంటనే మాయమైంది. మురళి విషాదంగా నవ్వి "అసమర్ధుడైన కొడుకు, విధులన్నీ సక్రమంగా చెయ్యగలడో లేదో అని జాలిపడి మా నాన్నే పంపించి ఉంటాడీ డబ్బు" అన్నాడు.

ఎవరెవరో దూరపు బంధువులు వచ్చి వెళ్లారు. తండ్రి జ్ఞాపకం వచ్చినప్పుడల్లా ఉష ఏడుస్తూనే ఉంది. ప్రభాకరం ఎంత చెప్పినా వినకుండా తనకి బహుమతి కింద వచ్చిన వెయ్యిరూపాయలూ, తండ్రి కర్మ కాండకి ఖర్చుపెట్టేశాడు మురళి. పదిహేను పదహారు రోజులు భారంగా గడిచాయి. "ఎన్నాళ్లింకా మీ ఇంట్లో మేం ఉండడం?" అన్నాడు మురళి ఓరోజు రాత్రి భోజనాల య్యాక హాల్లో అందరూ కూర్చున్న సమయంలో...ఉషకీ మురళికీ, తమ ఇంట్లో ఉండడం మొహమాటంగా ఉందని కనిపెట్టారు ప్రభాకరం జోగమ్మాను.

"సరే" అని వెళ్లమంటే వాళ్లకి అక్కడ రోజు గడిచేదెలా? అన్ని వ్యాపారాలూ కట్టి పెట్టి అంకరాజు పారిపోవడంవల్ల మురళికి ఉన్న ఆ ఒక్క ఉద్యోగం కూడా పోయింది. పోనీ ప్రభాకరం దగ్గర ఏ కాంపౌండరు గానో చేరమంటే నామోషీతో బాధపడుతున్నాడు. ఏదో ఒక ఉద్యోగం చప్పుని దొరకాలంటే మాటలా? ఎక్కడ కూర్చున్నాయి ఉద్యోగాలు? మహా మహా బి.యే. లూ ఎమ్మేలూ పేసయిన వాళ్లకే లేవే?... పోనీ ఆ ఊరూ ఆ ఊరూ తిరిగి ఎక్కడో ఒకటి సంపాది స్తాడు. అప్పటిదాకా ఉషేనా ఇంటిదగ్గర ఉండాలికదా!... ఒక్కత్తే ఇంట్లో ఉంటే, అందులో పెళ్లికాని వయస్సులో ఉన్న పిల్ల... అనక ఏం అనుకుని లాభం? పోనీ అందాకా ప్రభాకరం ఇంట్లో ఉంటుంది అంటే, లోకం హర్షించవద్దూ? ఎదిగిన కొడుకు ఇంట్లో ఉండగా, పెళ్లికాని పిల్లని ఎలా ఇంట్లో పెట్టుకుంది జోగమ్మగారు అంటూ ఊళ్లో వాళ్లందరూ దవళ్లు నొక్కుకోరూ? అందులో శుద్ధ పల్లెటూరు.

అది కాదని ఇదీ, ఇది కాదని అదీ, గంట గంటన్నర చర్చించుకున్న తర్వాత, ఉషని మద్రాసు తీసికెళ్లి ఆంధ్ర మహిళాసభలో చేర్చడానికీ, అక్కడ ఉంటూ ఏ మెట్రిక్యు లేషన్‌కో కట్టి చదువుతూఉంటే, ఈలోగా మురళి జీవితంలో స్థిరపడి, ఉషకి ఏ సంబంధ మైనా నిశ్చయంచేస్తే, అప్పుడు ఉషని తీసుకు వచ్చి పెళ్లి చెయ్యడానికీ నిర్ణయించారు.

దూరంగా వెళ్లి, అక్కడెక్కడో ఒక్కత్తే ఉండాలా? అక్కడ మనుష్యులు ఎలా ఉంటారో ఏమో... పైగా ఇంత పెద్ద య్యాక ఇప్పుడు చదువుకోవడమేమిటి; పుట్టి పెరిగిన ఊరునీ అన్నయ్యనీ అందర్నీ వదిలి వెళ్ళడమే! ఉషకి కళ్లమ్మట నీళ్ల పర్యంతం అయింది. అసలీ సలహా చెప్పింది ప్రభాకరం. అందువల్ల అతని మీద చెప్పలేనంత కోపం వచ్చేసింది. అతనికేసి కొరకొరా చూసింది.

ప్రభాకరం నవ్వుతూ "ఏం? మద్రాసు వెళ్ళడం ఇష్టం లేదా? మరయితే ఒక్కత్తెవీ ఇంట్లో ఉంటావా మురళి ఆ ఊరూ ఈ ఊరూ వెళ్లి ఉద్యోగ ప్రయత్నం చేసు కుంటూంటే?" అన్నాడు. ఆరోజు అంకరాజు సంఘటన గుర్తుకువచ్చి, ఇంట్లో వంటరిగా

ఉండడానికి భయంవేసి 'హమ్మో'అని, గుండెల మీద చెయ్యివేసుకుంది "పోనీ అతనికి ఉద్యోగం వచ్చేదాకా, మా ఇంట్లో ఉండు" అన్నాడు. "ఒక్క రోజు రెండు రోజులు కాదు. అన్నయ్య స్థిరపడేటప్పటికి ఎన్నాళ్లుపడుతుందో ఏమో! అన్నాళ్ళూ మీళ్ల ఇంట్లోనా ?"—"ఊహుఁ!" అంది ఉష.

"మరయితే ఎక్కడుంటావు ఒక్కత్తెవీను. ఆంధ్రమహిళా సభలో అయితే భయంఉండదు. కాలక్షేపం ఉంటుంది... ఎంతమందో ఆడ పిల్లలు తోడుగా ఉంటారు. పైగా నీకుమంచి రక్షణ ఉంటుంది"

"నాకు అంతాకొత్తకదా? ఎలాఉంటుందో బాబూ"

"కొత్తేవిటి-ఒకటి రెండు రోజులు పోతే అదే పాత అవుతుంది... నీలాగ వచ్చిన వాళ్ళే అక్కడ చాలామంది ఉంటారు"

"పోనీ అలాగే — కానీ — నేను చదువుకోను బాబూ."

ప్రభాకరం పకపకా నవ్వి "చదువంటే అలా భయపడకు. అది ఊరికే కాలక్షేపం కోసం, నువ్వు ఫేలయినా పేస్ అయినా ఎవరూ అడగరులే — పైగా ఈ రోజుల్లో అధమం మెట్రిక్యులేషన్ అయినా పేస్ అవని పిల్లని ఎవరూ పెళ్లి చేసుకోవడం లేదు. తెల్సా ?" అన్నాడు.

ఉషకి అంతా నిజమే అనీ అనిపించింది, 'అయినా ఏమిటిది బాబూ' అని ఇబ్బంది గావూ అనిపించింది. పెళ్లికోసం ఎదురు చూస్తూ కూర్చోవడంకంటే చదువంటూ ఓ కాలక్షేపం ఉండడం మంచిదే!... పైగా తను ఖాళీగా కూర్చుంటే అమ్మానీ నాన్నా జ్ఞాపకంవచ్చి ఆ రోజంతా ఏడుపుతోటే సరి పోతోంది. ఈ సమయంలో తనకిలాంటి వ్యాపకం ఏదో ఉండడం అవసరం... "సరే" అంది ఉష ఎలాగైతేనేం చివరకి.

"మరి ఇన్నాళ్లూ ఉంచాలంటే డబ్బో!" అనే ప్రశ్న వచ్చింది. "ఆ ఇబ్బంది ఏం లేదు. ఎంతయితే అంతా నేను ఇస్తాను" అన్నాడు ప్రభాకరం. అందుకు మొదట ఉషా, మురళీ ఇద్దరూ ఒప్పుకోలేదు. "పోనీ ప్రస్తుతానికి వాడు పెట్టే ఖర్చు అంతా అప్పుగా చూసుకోండి. తర్వాత తీర్చుకో వచ్చు" అంది జోగమ్మ. "సరే అయితే" అన్నారు అన్నా చెల్లెలూను.

ఆ మర్నాడు ఢిల్లీ నుంచి ఉత్తరం డ్రాఫ్టు వచ్చాయి. మురళి ఎగ్జిబిషన్‌కి అని పంపిన రెండో చిత్రాన్ని ఎవరో అయిదు వందల రూపాయలకి కొన్నారనీ, ఆ సొమ్ముకి డ్రాఫ్ట్ తీసుకుని పంపిస్తున్నాం అనీ ఉంది ఆ ఉత్తరంలో...

"అబ్బో ... అయితే నువ్వుపెద్ద చిత్ర కారుడివి అన్న మాట! నీ చిత్రకళా నైపుణ్యానికి పరవశమై ఆ చిత్రాన్ని కొన్న వ్యక్తి ఎవరో!" అంటూ మురళి వీపు తట్టాడు ప్రభాకరం.

తనని ఆంధ్ర మహిళా సభలో చేర్పించి తిరిగి వెళ్లిపోతూ "తరుచు అప్పుడప్పుడు వచ్చి చూసి వెళుతూ ఉంటానులే. నువ్వు మాత్రం వారానికో ఉత్తరం ప్రభాకరానికి రాస్తూండు నేను ఊళ్లోఉన్నా లేకపోయినా" అని మురళి అన్నప్పుడు ఉషకి ఆపుకోలేనంత ఏడుపు వచ్చేసింది.

ఉన్న ఊరు వదిలి ఇంత దూరంలో ...

ఏమీ పరిచయంలేని ఈ మనుష్యుల మధ్య ఒంటరిగా.

ఈ పట్నం ఏవిటో, ఈ ఆంధ్ర మహిళా సభ ఏవిటో...

మురళి వెళ్లిపోయిన దిక్కే చూస్తూ పెద్ద బెంగతో కళ్లనీళ్లు కారుస్తూ నిలబడ్డ ఉష బుజంమీద, చల్లని ఆప్యాయతతో కూడిన చెయ్యి మృదువుగా పడింది.

ఉష ఉలిక్కిపడి వెనక్కితిరిగి చూసింది. ఆంధ్ర మహిళాసభ ముఖ్య సంరక్షకురాలు జమునాబాయిగారు! ఆమె కళ్లల్లో ఎంతో జాలీ, మరెంతో ఆత్మీయత! ఆమె తన కన్నీళ్లు తుడుస్తూ ఉంటే, ఆపుకోలేని దుఃఖం వచ్చేసి ఆమె బుజంమీద వాలి పోయింది ఉష.

జమునాబాయిగారు ఉష వీపు నిమిరి, దగ్గరగా తీసుకున్నప్పుడు, ఉష వళ్లంతా జలదరించింది. ఆమె స్పర్శ ఎంత హాయిగా ఉంది!...మళ్లా అమ్మని గుర్తుకు తెస్తోంది ఆమె కౌగిలి !

## 6

ఆ అమ్మాయి ఎవరో పక్క ఊరునుంచి పురుడు పోసుకోడానికని తన హాస్పటల్‌కివచ్చి, ఇక్కడ లేడీ డాక్టరులేదని తెలిసి, తనుపురుడు పోస్తానంటే ఒప్పుకోకుండా, ఎంత చెప్పినా వినిపించుకోకుండా, వెనక్కి వెళ్లిపోయి, ఆ తర్వాత కాన్పు కష్టం అయి, చనిపోవడంతో అర్థం అయింది ప్రభాకరానికి, తన హాస్ప టల్‌లో, లేడీ డాక్టరు ఎంత అవసరమో. అందుకే తనకి తరుచు సాయంగా వచ్చే పట్నంలో పెద్ద డాక్టరుకి కబురు చేశాడు, ఎవరైనా తెలివైన లేడీ డాక్టరు ఉంటే పంపించమనీ, నెలకి వెయ్యి రూపాయల దాకా ఇస్తాననీను. ఒక వారం అయాక ఆయన దగ్గరనుంచి జవాబు వచ్చింది. "జానీ అనే అమ్మాయిని పంపిస్తున్నాననీ, ఆ అమ్మాయి మొన్ననే హౌస్ సర్జన్ పూర్తి చేసింది అనీ, నెమ్మది అయిన పిల్ల అనీ, ఒకటిరెండు నెలలు ప్రభాకరం తన ఇంట్లోనే ఆమెకి భోజనం మకాం ఏర్పాటు చేస్తే, ఆ తర్వాత తల్లిని తెచ్చుకుని వేరే కాపురం ఉంటుందనీ, పెళ్లి



కాని పిల్ల అయినా ప్రభాకరం గురించి తను ఎంతో ఉన్నతంగా చెప్పడం వల్ల, డాక్టర్ జానీ, ప్రభాకరం పల్లెటూరు రావడానికీ, అతని అసిస్టెంట్‌గా పని చెయ్యడానికీ, కొన్నాళ్ళు అతని ఇంట్లో ఉండడానికీ అంగీకరించిందని'' ఆ ఉత్తరంలో ఉంది.

అది డాక్టరు జానీ వస్తుందన్న రోజు, పేషెంట్లని పరీక్ష చేస్తూ, మధ్య మధ్యవాచీ చూసుకుంటూ, జానీ రాక కోసం ఎదురు చూస్తున్నాడు ప్రభాకరం.

హాస్పటల్‌ముందు ఏదో కారు ఆగినట్లయింది. 'ఆమె వచ్చింది కాబోలు' అనుకుంటూ ప్రభాకరం ఎదురు వెళ్లాడు. పట్నం టేక్సీ అది. అందులోంచి గలగల నవ్వుతూ పద్దెనిమిది, పందొమ్మిదేళ్ల యువతి, ఆధునికమైన అలంకారంతో వేనిటీ బేగ్ విలాసంగా ఊపుకుంటూ దిగింది, జుట్టు విరబోసుకుని గాగుల్స్ పెట్టుకుంది. ఎంతో శ్రద్ధగా



## గాజు మేడ

మేకప్ అయినట్లుంది. వంటినిండా ఏ ఆభరణాలూ లేవు ఎడంచేతిని చిన్న వాచీతప్ప. పువ్వుల లుంగీ, విరబోసుకున్న జుట్టుకి ఓ పక్కగా చెవిదగ్గర ఎర్ర గులాబీ పెట్టుకుంది.

రూపుదాల్చిన ఆ నవ నాగరికతని చూసి, విస్తుబోయి ఆ మెట్టునే నిలబడిపోయాడు ప్రభాకరం.

ఆ యువతి దగ్గరగావచ్చి ప్రభాకరం రెండు బుజాలూ పట్టుకుని కుదుపుతూ "అదేవిటి అన్నయ్యా... అలా తెల్లబోయి చూస్తావు ?'' అంది.

ప్రభాకరం వెంటనే తేరుకుని "ఓ!... నువ్వా లీలా!... వంపేశావు... నేనింకా ఆ కొత్త డాక్టరు జానీ ఏమో అనుకున్నాను ... ఈ రూపం ఏమిటి, ఈ వేషం ఏవిటి, ఎక్కడనుంచి రావడం'' అంటూ పలకరించాడు.

"జానీ ?... జానీ ఎవరు ?'' అంది లీల గాగుల్స్ తీసి చేత్తో పట్టుకుంటూ ...

"ఉందిలే, ఒక లేడీ డాక్టరు. ఇవాళ రావాలి... ఊ ... నువ్వేమిటి ఢిల్లీ నుంచేనా రావడం ? నాన్న కులాసా ... ?'' అంటూ లోపలికి దారితీశాడు ...

టేక్సీ అతనితో "ఉండవయ్యా ఒక అర గంటలో వచ్చేస్తాను'' అని చెప్పి, ఆశ్చర్యంగా హాస్పటల్ అంతా చూస్తూ "ఇంత పల్లెటూళ్లో ఇంత పెద్ద హాస్పటలా ? పెద్ద నాన్నది ఎలాగేనా భారీచెయ్యే! నీకోసం ఇంత హాస్పటల్ కట్టించాడన్నమాట!'' అంటూ ప్రభాకరం వెనకాలే అతని రూమ్‌లోకి వెళ్లి ఓ కుర్చీలో కూర్చుంది లీల.

"ఒక్కత్తే వచ్చావేమిటి బాబయ్యగారు రాలేదా ?''

లీల నవ్వి "నాన్నగారు ఢిల్లీలోనే ఉన్నారు. మేం కొందరం ఫ్రెండ్స్ సౌత్-ఇండియా టూర్ వేసుకుని ఇలా వచ్చాం. వాళ్లంతా టౌన్‌లో ఈరోజంతా గడుపుదాం అంటే, ఈలోగా నిన్నూ దొడ్డమ్మనీ చూసి వెళ్ళొచ్చుని రానూ పోనూ టేక్సీ చేయించుకొని ఇలా వచ్చాను. అవును గానీ, ఈ ఊళ్లో వాళ్లని ఇల్లు చూపించమంటే నీ హాస్పటల్ చూపించారేవిటి ?...ఇంటికి ఎలా వెళ్లాలి ? దొడ్డమ్మ ఇంట్లో ఉందా ?'' అంటూ గబగబా మాట్లాడేసింది.

"ఏవిటా కంగారు ? కాస్సేపు స్నిమితపడు ... ఇల్లూ హాస్పటల్ అంతా ఒకటే బిల్డింగు. ఆ వీధిలోకి ఇల్లూ ఈ వీధిలో హాస్పటలూను. మధ్యన అదిగో ఆ అద్దం కనిపిస్తోందే, ఆ అద్దం ఉన్న తలుపు తోసుకునివెళ్తే ఇంట్లోకి వెళతావు.''

"ఐ. సీ. బలేగా ఉందే!... ఆ...అవును గానీ మీ ఊళ్ళో మురళి అని ఓ పెద్ద ఆర్టిస్టు ఉండాలి. ఆయన్ని మనం ఓ మాటు కలుసుకోవచ్చా ?''

ప్రభాకరం నిర్ఘాంతపోయి ఉండిపోయాడు.

"ఏవిటి అలా తెల్లబోతావు ? ఆయనది ఈ ఊరే! ఢిల్లీ చిత్రకళా ప్రదర్శనంలో ఆయనకీమధ్య బహుమతి కూడా వచ్చింది. ఆయన రాసిన ఇంకో చిత్రం 'సగటుమనిషి'ని నేను కొన్నాను''

"అదీ అలా చెప్పు...ఆ బొమ్మ కొన్నది నువ్వన్నమాట... ఇక్కడే మనింట్లోనే ఉన్నాడులే...నువ్వీలోపుగా ఇంట్లోకివెళ్లి అమ్మతో మాట్లాడుతూ ఉండు... నేనోక లేడీ డాక్టరు కోసం వైట్‌చేస్తున్నాను. ఆవిడని రిసీవ్ చేసుకున్నాక నేనుకూడా లోపలికి వస్తాను''

"వస్తున రా మరి...నేను మళ్లీ వెళ్లిపోవాలి''

"నీ మొహం అప్పుడే వెళ్ళడం ఏమిటి?'' అంటూ "వద్దు అన్నయ్యా!''అని లీల చెబుతున్నా వినిపించుకోకుండా టేక్సీ డ్రైవర్ కి డబ్బులిచ్చి పంపించేశాడు ప్రభాకరం. "నా ఫ్రెండ్స్ అక్కడ నా కోసం చూస్తూ ఉంటారు. పైగా ఇంకా అమరావతీ, రామప్ప గుడీ, హంపీ ఇవన్నీ చూడాలి నేను వాళ్లతో కలిసి''అంది లీల. "ఆ సంగతి అంతా నేను చూస్తాను. శిల్పాలూ, చారిత్రక ప్రదేశాలూ, అన్నీ చూపించే ఏర్పాటు నేను చేస్తాను. ఈ లోగా సాయంత్రంఎవరినైనా టౌనుపంపించి నీ సామాను అంతాఇక్కడికి తెప్పిస్తాను''అంటూ ప్రభాకరం, లీల ఏం చెబుతున్నా లక్ష్యపెట్టకుండా తన పేషెంట్స్‌వేపుదృష్టిమరల్చాడు.

"నీతో వచ్చిన చిక్కే ఇది'' అంటూ చిన్నపిల్లలా కాస్సేపు చిందులు తొక్కి, అద్దం తలుపు తీసుకుని లోపలికి వెళ్ళింది లీల.

[ఇంకా ఉంది]

**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna**

## ఉత్తరాలు

(4వ పేజీ నుంచి)

### సీరియల్

విశాఖ రచన 'యుగ సంధి' మా ఇంటిల్లిపాదినీ విశేషంగా ఆకర్షించింది. అందులోని పాత్రలు అద్భుతమైనవని అనటంలో అతిశయోక్తి లేదేమో! సాంప్రదాయాలంటూ పూర్వపు అలవాట్లకు కట్టుబడే "యాజులు" బాల్య దశలో వితంతువుగా మారి సంఘం నిర్మించిన నీతి, నియమాల ధర్మ పన్నాల ఉక్కుచట్రాలో బంధింపబడి బాహ్య ప్రపంచముతో సంబంధం లేని 'మాలతి', ప్రేమించిన గోపాల్‌ను పొందలేక, తండ్రి ఆజ్ఞననుసరించి గడప దాటని 'మాధవి', తాతగారి నోటి మాటను వేదంగా ఆచరిస్తున్న 'సుందరం', తనకంటే క్రింది అంతస్తు వాడు కుమార్తెను ప్రేమించడం, సహించక, కరుకు కసాయిగా మారి, ప్రవర్తిస్తున్న 'మూర్తి' ఆదర్శ భావాలు గల 'వేణు, రామం, శ్రీను, అశోక్ మరియు సుజాతు', ఇలాంటి విభిన్న భావాలు గలవారి మధ్య విశాఖ గారు కథ ఎలా నడిపిస్తారోయని మిక్కిలి సస్పెన్సుతో పడి ఉన్నాము. తరువాత "ఈ సంఘములో కుటుంబమే యిది"లో గోపాలరావు పాత్ర పట్ల జాలివేస్తుంది "చేతులు కాలాక ఆకులు పట్టుకున్న" స్వభావం అయ్యింది. పగవాడికైనా ఇలాంటి కష్టాలు వద్దురా బాబు అని దేవుని ప్రార్థిస్తున్నాము. గోపాలరావు కుటుంబములాంటి కుటుంబాలు ఈ సంఘములో కోకొల్లలు. అలాంటి యజమానులు ఎంతయినా ఈ సీరియల్‌ని చదివి తమ కర్తవ్యమును పాటించగలరని ఆశిద్దాం. మరియు నిజ జీవితానికి సంబంధించిన కథలు నేడు అరుదు. కానీ అన్నపూర్ణగారి ఈ సీరియల్ వాస్తవికంగా నిజజీవితంలో చెలామణి అయ్యే కథలకు సన్నిహిత సంబంధం ఉన్నది. తరువాత 3—7—75 పత్రికలో "మంచివాడు, పాప మొకరది, శిక్ష ఇంకొకరిది" కథలు చాలా బాగున్నాయి. "యుగ సంధి" విశాఖగారు, రచయితా? రచయిత్రా? తెలియజేయగలరు.

టి. దాలయ్య, నూరాడ నారాయణరావు,
ఎస్. ఇ. రేల్వే హిమ్‌గిర్, (ఒరిస్సా)

[* 'విశాఖ'గారు రచయిత్రియే! —సం]

• • •

కథల సంఖ్య బాగా తక్కువే అయినా "గంగి గోవు పాలు గరిటడయినను చాలు" అన్నట్లు ఉన్నాయి. 'అందరిలో గుడి ఉంది' కథ చక్కని సందేశాత్మక కథాంశం కలిగి ఉంది.

— భానుమూర్తి, (కాశీబుగ్గ)



"పుణ్యంకొద్దీ పురుషుడు"లో జయంతి ▶

ఆలుమగల తగవులు చిలికి చిలికి గాలివానయితే ఆ గాలివానలో కాగితం
పడవల్లాంటి పసిపిల్లల జీవితాల గతేమిటి?



ముప్పలనేని శేషగిరిరావు సమర్పించు

రవిశంకర్ ఆర్ట్ పిక్చర్స్

రంగనాయకమ్మ నవల

# బలిపీఠం

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత
వై. సునీల్ చౌదరి

స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వం
దాసరి నారాయణరావు

సహనిర్మాత బి. శ్యామ్‌ప్రసాద్ సంగీతం చక్రవర్తి కెమెరా వి.వి.ఆర్. చౌదరి ఎడిటింగ్ కె. సత్యం ఆర్ట్ కళాధర్ - భాస్కరరాజు